# దైవమిచ్చిన భార్య





గుడిపాటి వెంకటచలం,
గవర్నరుపేట, బెజవాడ.



A

# దైవమిచ్చిన భార్య

## చిన్నతనం.

ఆ రోజుల్లో నేను సుందరవరం లోవరుశకండరీ స్కూలులో చదువుకునేవాణ్ణి. నాకూ, నాచిన్న స్నేహితులకీ, యేది చూచినా నవ్వుగా ఆనందంగా వుండేది. కాలవవొడ్డున మామిడికాయలు కొట్టుకుతినడం, బల్లకట్టుమీద యెక్కి ఆ వొడ్డుకీ యీ వొడ్డుకీ తిరగడం, చాలా సరదా మాకు. ఆ బల్లకట్టువాడు మమ్మల్ని తిట్టిన కొద్దీ మాకు సంతోషం. చెంచు వాళ్ళ గాడిద అట్లా వస్తే చాలు, అరఫర్లాంగుమారం దాన్ని తరిమితేనే గాని వొదిలేవాళ్ళంకాదు. కొత్తకుర్రవా డెవడన్నా కనపడగానే వాణ్ణి కేక వేసి, పిలిచి, వెక్కిరించి, తిట్టి, అధికప్రయత్నం మీద వాడికి కోపం తెప్పించి వాడిచాత తిట్టించుకుని, వాణ్ణి తన్ని, అప్పుడప్పుడు తన్నులు కూడా తిని, యిన్ని పాట్లుపడేవాళ్ళం. కాని పేడతట్ట నెత్తిమీద, పెట్టుకుని ఒకపిల్ల గేదెని తోలుకుంటో వొచ్చేది. ఆగేదె మీద యెక్కి పరిగెత్తించి, ఆ పిల్లని యేడిపించాలని యెంతో వుండేది.కాని ఆధైర్యం మాలో వొక్కడికీ వుండేదికాదు. అదే మొగకుర్రాడైతేనా! ఆఖరికి ఒకరోజు యెక్కడానికి ఆగేదె దగ్గరకి వెళ్లాను; ఆ పిల్ల నాకేసి చూసింది; ఆ చూపులో నా హృదయానికేదో కనిపించింది; సిగ్గుపడి మాట్లాడకుండా వెనక్కి వొచ్చేశాను.

ఆ వూళ్ళో మానాన్నగారు తాసిల్దారు. వూరి వెలపల మామిడితోట మధ్యవున్న పెంకుటింట్లో వుండేవాళ్ళం. దాన్ని తరవాత మా నాన్నగారు కొన్నారుకూడాను. మాయింటి పక్కన ఆవూరి జమీందారుగారిది పెద్దతోట వుంది. పూర్వం ఆవూరంతా ఆ జమిందారుదే; కాని ఆమహాత్ముడు ఆ ఆస్తి నంతా వ్యయంచేసి పరలోకానికి దాటాడు. ఇప్పటికీ వాళ్ళకి ఆవూళ్లో చాలా భూములున్నాయి.

రాణీగారు వొస్తారంటే ఒకరోజు సాయంత్రం రైలుస్టేషనికి వెళ్లాను. నాకు మల్లేనే వచ్చిన నాస్నేహితులు పదిమంది చేరారు.

దైవమిచ్చిన భార్య



రైలులోంచి యెన్నో ట్రంకులు యెంతో సామాను దిగింది. ఒకరిద్దరు మొగవాళ్ళూ, ఆడవాళ్ళూ, నౌకర్లు దిగారు. మాకు "యింటరెస్టు" యిచ్చిందల్లా వాళ్ళలో ముగ్గురు పిల్లలు, యిద్దరు మొగపిల్లలూ, ఒక అమ్మాయీ. ఆ కాలంలో వాళ్ళసంగతంతా మాకు ఆశ్చర్యమే. పరుపులుంటాయే ఆ శెకండు క్లాసులోంచి దిగడం వొకటీ; తెల్లదొరపిల్లలమల్లే అట్లా లాగులూ బూడ్సులూ వేసుకోడం; వాళ్ళ అతివిచిత్రంగా మాపంకా, మాపొట్టిలాగులూ, చిరుగుచొక్కాలూ, దుమ్ముమొహాలూ, చీదరతలల పంకా చూడడం; చివరికి ఆ అమ్మాయికూడా దొరపిల్లమల్లే బట్టలు వేసి, రెండుజడలు వెయ్యడం, యివన్నీనీ. నౌకర్లు చక చక సామానంతా బళ్ళల్లోకి యెక్కించారు. వాళ్ళు గుర్రింబండిలో యెక్కి బయలుదేరారు. మేమందరం యిరవైమందిమి కేకలు వేస్తో వెంటపడ్డాము.

ఆరోజునుంచి నాకు తోటలో అడుగుపెట్టడానికి ధైర్యం చాలింది కాదు. ఒకవారం అయింతరవాత, ఒకరోజు నేను బడినించివొచ్చేటప్పటికి మా నాన్నగారు అల్పాకా కోటూ, పెద్దబూడ్సులూ వేసుకుని జరీతలపాగా పెట్టుకుని, వీధులో కుర్చీలో కూర్చునివున్నారు. కలెక్టరు మా వూరు వొచ్చాడు గావును అనుకున్నాను. ఇంట్లో చూస్తే మా అమ్మకూడా అలంకారం చేసుకునిసిద్ధంగా వుంది. అమ్మమ్మవొచ్చి గబగబ నామొహం సబ్బుతో కడిగి, నాజుట్టు దువ్వి ముడేస్తోంది. అప్పటికి గుక్క తెముల్చుకొని యేమిటీ ప్రళయం అని అడిగాను. జమిందారుగారి యింటికి చూడడానికి వెడుతున్నామన్నారు.

వాళ్ళ మేడలోకి వెళ్లాం. నాన్నగారు మొగవాళ్ళతో మాట్లాడుతూ ముందు హాల్లోకూచున్నారు. నేను అమ్మతో లోపలికి వెళ్ళాను. రాణీగారిని చూడటంతోటే నా కామె మీద యిష్టం కలిగింది. ఆమె అమ్మని యెంతో మర్యాదచేసి,

"మీఅబ్బాయా? సుదర్శనం యూకువాడే అనుకుంటా" అంది.

"పన్నెండోయేడు శ్రావణంలో పుట్టాడు"

"ఆర్నెల్లు పెద్ద అన్నమాట వాడు మాఘమాసంలో పుట్టాడు ........................ఒరేయ్ అబ్బాయిల్నీ, అమ్మాయినీ, యిట్లారమ్మన్రా"

ముగ్గురూ గంతులు వేసుకొంటో వొచ్చారు, కొత్త వాళ్ళని, మమ్మల్ని చూసి గుమ్మంలో ఆగారు.

"వాడే పెద్దబ్బాయి, పదమూడేళ్లు, తాతగారి పేరు, వెంకటరత్నం. వీడురెండోవాడు సుదర్శనం, తరవాతది ఆ ఆడపిల్ల, తండ్రి కోరి పద్మావతి అని పెట్టుకున్నారు. పేరుపెట్టి పిలిచి, బిడ్డ పలికితే వినకండానే......"

తక్కింది చిన్న దుఃఖంలో మాయమయింది. కొంచెంసేపట్లో మళ్ళీ సద్దుకుని....................

"మీకో స్నేహితుడు వొచ్చాడు చూశారుటోయ్. పట్నం స్నేహితుల పల్లే లేదనా యేమిటి; దూరంగా నుంచుని చూస్తున్నారు?........ఆవూళ్లో వీళ్ళకి చటకారీ కుర్రవాళ్ళతో స్నేహం. యేమైనాసరే ఆ అరపవాళ్ళతో ఆడుకోరు. మేము వుండేచోట మనవేపు వాళ్ళెవరూ లేరు........యితన్ని తీసికెళ్ళి గుర్రాలూ, తోటా చూపించండి, ఆడుకోండి. పోట్లాడుకోకండేం. వెళ్ళమ్మా".........అంది.

ఆపిల్లలు నావొంకే చూడలేదు, వెళ్ళిపోతున్నారు. నేను వెనకాలే వెళ్ళాను. తోటదాకా వెళ్ళేటప్పటికి వాళ్ళు ఒక్కొక్కళ్లే కొంచెం నాకేసి తిరగడం, అటుకేసి తిరిగి నవ్వుకోడం మొదలుపెట్టారు. కొంచెంసేపుండి సుదర్శనమన్న అబ్బాయి నాదగ్గరికి వొచ్చి నాటోపీ కింద పడేశాడు- పది రూపాయలు పెట్టి కొన్న జరీ పట్టుటోపి. ముగ్గురూ గడ్డిమీదపడి నావంక చూస్తో పకపక నవ్వారు. ఆపద్మావతి అన్నపిల్ల కూడానూ. ఆడపిల్ల మళ్ళీ.

"ఎందుకు అట్టా నవ్వుతారు?" అని కోపంతో అడిగాను. అడిగేప్ప టికి మరీనవ్వారు. నావంక చూస్తో ఆపిల్ల నెత్తిమీద చేతులు పెట్టి రాసు కుంది. నాకు తల సగంవరకే జుట్టు పెట్టారు. అయితే నాజుట్టు చాలా పొడుగు. అమ్మకీవాళ్ళకీ దాన్నిచూస్తే చాలాయిష్టం.

"మనరాధకి (నాపేరు రాధాకృష్ణ) వున్నంత జుట్టుయేఆడ పిల్లకీ వుండదు." అనేది మాఅమ్మమ్మ.

ఆ జుట్టు శిగజుట్టి జడవేశేవాళ్ళు. దాన్నీ, చూసి వీళ్ళునవ్వడం. ఆమొగపిల్లల తలలు కిరస్తానీ కత్తిరింపులు. నాకు కోపం వచ్చింది.

"ఏదీ, నాజుట్టుతో సీదికొలు" అన్నాను, పద్మావతిని. ఆమాటతో కడుపులు పట్టుకుని గడ్డిమీదపడి కాళ్ళెగరేస్తో నవ్వారు. ఆ పద్మావతి కూడానూ. యెందుకు వొచ్చానా అక్కడికి అనిపించి వెనక్కితిరిగాను. నవ్వు కొంచెం ఆపుకుని "ఆబట్టలు చూడండి" అన్నాడు సుదర్శనం. యింక వాళ్ళపొట్టలు బద్దలవుతాయనుకున్నా నవ్వుతో. నావొడుగు నాడు కుట్టించిన పువ్వుల నల్లని మొహమల్ సూటికి వచ్చిన తిప్పలది. నాకు రోషంవచ్చి అక్కడే ఆగాను. ఆ అమ్మాయి నోట్లో వేలేసుకుని నావంక చూస్తో దూరంగా నుంచుంది. ఆ యిద్దరు పిల్లలూ యేదో చేతిరుమాలు కోసం తగాదాపడుతున్నారు. మాఅమ్మా, రాణీగారూ వొచ్చారు. మాఅమ్మ, "టోపీ కింద పారేసుకున్నావేం?" అని యెత్తి దులిపి, నెత్తిమీద పెట్టింది. నేను పద్మావతి మొహం కేసే చూస్తున్నా నోట్లో ఆవేలు గట్టిగా కుక్కు కుందిగాని ఆకోలకళ్ళల్లోంచి నవ్వు పొంగుతోంది. టోపీ నానెత్తిమీద కాలు తున్నట్లయింది. మాఅమ్మ అటుతిరగగానే అంత గొప్పటోపీని మడిచి జేబులో పెట్టాను. యింతలో సత్యవతమ్మగారు, అంటే రాణీగారు, నాపేష చెయ్యేసి "మీకుర్రవాణ్ణి యింత పూర్వోత్తరంగా వుంచారేం? యీకాలానికి యివన్నీ సరిపడవు." అని, నన్ను చూసి, "మాఅమ్మాయితో, అబ్బాయి లతో ఆడుకోడానికి ప్రతిరోజూ వొస్తావా? అని అడిగింది. నాకళ్ళల్లో నీళ్ళు

తిరిగాయి. మొహంతిప్పేసి తలవూయించాను. యింక జన్మంతో ఆతోటలో అడుగు పెడతానా?

యింటికివెళ్ళేప్పుడు నా జేబులనిండా సీమబాదంకాయలూ, ఆక్రోటుపళ్ళూ నింపారు. అప్పుడుమాత్రం, పిల్లలులేని సమయంలో, సత్యవతమ్మగారిని చూడ్డానికి వొస్తే లాభంగానే వుంటుందను కొన్నాను. ఆ రాత్రంతా మాయింటిలో జమీందారుగారివాళ్ల కబుర్లే. యింతకీ వాళ్లు యెట్లాగో మాబంధువులేట, యెప్పుడూ ఆపిల్లల చదువుకోసం, సత్యవతమ్మగారు చెన్నపట్టంలో వుంటారు. పద్మావతి పెళ్లికని, యిప్పుడు యీవూరువొచ్చారు. యింక మావాళ్ళు ఆసత్యవతమ్మగారినీ పిల్లల్నీ యింటినీవొర్ణించడం వాళ్ళ నవనాగరీకాన్నియెక్కిరించడం నాకర్థంకాలేదు. అప్పుడు

మూడు రోజులైన తరువాత ఆజమిందారుగారివాళ్ళు మానాన్నగారిని చూడడానికి వొచ్చారు. నాన్నగారు ఆపిల్లల్ని బయిటికి తీసికెళ్ళి ఆడుకోమన్నారు. విధిలేక రమ్మనిపిలిచి వాళ్లని మాచిన్నితోటలో తిప్పాను.

"బెచ్చాలు ఆడుకొందామా?" అన్నాను.
ఒకరిమొహాలు వొకరు చూచుకొన్నారు.

"పోనీ గూటి బిళ్లలాడదాం? చాతకాదూ? గోలీలాడండి దెబ్బకుగోలీ-నావే అప్పిస్తాలెండి యిప్పిటికి, తరవాత తీర్చుకుందురుగాని, అదీ చేతగాదూ? ఎందుకు నవ్వుతారు? మీవూళ్లో యేమాడుకుంటారు?"

వాళ్లేవేవో, ఆటలపేర్లు చెప్పారు. నాకు వొకటీ తెలీలేదు. కాలవ వొడ్డికి వెళ్లాము
"మామిడిపిందెలు రాలకొట్టి తిందామా?" అన్నాను.
సరేనని వొప్పుకున్నారు. వేశారు, వేశారు, రాళ్ళు యిద్దరూ, ఒకటన్నాతగిలితేనా! నేను దెబ్బకోకాయ పడేశాను. తీసుకోమంటే ఆకాయలు

తీసుకొన్నారు కారు. అభిమానం! అవన్నీ పద్మావతి జేబులో పోశాను. నన్నని ముందరిపళ్ళతో యెలికలాగు ఒకకాయని కొరికి, పులుపుకి మొహంచిట్లించి, నన్ను చూసి నవ్వింది. ఆఒక్క నవ్వుతో నేనా అమ్మా యికి లోబడిపోయినాను.

"మాలోట్లో మామిడిచెట్లకి రాలకొట్టగలవూ? చాలమెత్తు అవి. ...నచీకటి. కాయలు కనపడవు." అంది పద్మావతి, దోవలో.

"కావలిస్తే యెక్కికోస్తాను"

"యేమిటి? అంత యెత్తుచెట్లు?.................. బలేవాడివి లాగున్నావే? వెలగపళ్ళో?"

"యేచెట్టయినాసరే—తాడిచెట్టుకూడా ఆఖరికి"

"రేపు సాయింత్రం వొస్తావా?"

నాకు ధైర్యం వొచ్చింది.

"మరి నన్నుచూసి నవ్వరుకదా?"

పద్మావతి మాట్లాడలేదు-సుదర్శనం

"మరి ఆ అరవవాళ్ళమల్లే, అట్లాంటి జుట్టుచూస్తే నవ్వరామా?" అన్నాడు.

రాత్రి మాయింటో పంతం పట్టాను.

"వాళ్ళమల్లే నాకుకూడా జుట్టు కత్తిరిస్తారా లేదా?" అని

"నీకు మతిపోయిందా? నువ్వుకూడా జమిందారుడివైతే అట్టా కత్తిరించుకుందువుగాని" అన్నారు.

తగాదా పెట్టాను. మళ్ళీ యీజుట్టుతో పద్మావతికి కనపడడ మెట్లా? చివరికి ఆముడి వెనకాలముడిగానేవుంచి, ముందు గొరక్కుండా కత్తిరింపు పెట్టేట్టు సంధిచేసుకొన్నాము.

మర్నాటినుంచి ప్రతిసాయింత్రం జమిందారుగారి మేడకి వెళ్ళేవాణ్ణి. ఆతోటంతా ఆపిల్లలకి కొత్తే. యేమూల యేంచెట్లున్నాయో, అవి యేం

వుపయోగమోనేను చెప్పిందాకా వాళ్ళకి తెలీనేతెలీదు. బాదంపళ్ళ పైపెచ్చు తియ్యగా వుంటుందనీ, బుర్రగుంజు పగలగొట్టి తింటారనీ, యీతపళ్ళు మాగేస్తే బాపుంటాయనీ, నల్లకామాక్షి విషంకాదనీ, అరటిపువ్వులు అంతా వొలిచింతరువాత లోపల చేదుండదనీ, యివన్నీ నేర్పాను. నాలోకాను భవాన్నీ, ప్రజ్ఞనీచూసి, నన్ను చూస్తే వాళ్ళకినవ్వ మాయమయింది. నా కంటే వాళ్ళు యింగ్లీషు బాగా మాట్లాడగలరు. కాని శివాజీ యెప్పుడు పుట్టాడో, వానయెందుకు కురుస్తుందో, వాళ్ళకి తెలీదు. పందొమ్మిది పన్ని శ్లెంతంటే, కాయితంమీద పెనసలుతో లెఖ్ఖేసి, తప్పుచెప్పేవాళ్ళు. యింత చెట్లెక్కడం, గోతుల్లోదూకడం, గాడిదమీద షికార్లుచెయ్యడం, కాలవలో యీదడం, చెట్లకితాళ్ళుకట్టి ఉయ్యాలలూగడం, యేమీ చేతకావు వాళ్ళకి.

ఆ అన్నలకీ పద్మావతికీ యెప్పుడూ పోట్లాట. చిన్నదాన్ని చేసి యేమీయియ్యక యేడిపించేవాళ్ళు. నేను వాళ్ళతోకలసిన తరవాత పోట్లాటలు యెక్కువయినాయి. నేనెప్పుడూ ఆ పద్మావతిపక్షం. నన్ను ఆసరా చూసుకొని ఆఅమ్మాయి వాళ్ళమీద మరింతతిరగపడడం మొదలుపెట్టింది. నాకు తెలిసిన యీవిషయాల్ని చూసి, నన్నుచూస్తే ఆఅమ్మాయికి గౌరవం. నాఅంత గట్టివాణ్ణి చూడలేదనేది.

వాళ్ళిద్దరితో పోట్లాడి నేనూ పద్మావతీ యేచెట్టుకిందో ఆడుకొనే వాళ్ళం. వీపులమీద పడుకొని చెట్ల ఆకుల్లోంచి ఆకాశం నీలంచూస్తో యేవేవో ఆలోచనలు చేసేవాళ్ళం. నేను యెంతో గొప్పవాణ్ణి అవుతాననీ, కలెక్టరునో, యుద్ధాలుచేసేరాజునో, అవుతాననీ కబుర్లుచెప్పేవాణ్ణి. పద్మావతికూడా తనూ చాలా గొప్ప దాన్నవుతాననేది.

"నీమొగుడు గొప్ప వాడయితే, నీవు గొప్ప దానివి అవుతావు. అంతేగాని ఆడదానివి నీకు గొప్పేమిటి?" అని అధికమైన అనుభవంతో నేను అనేవాణ్ణి.

పద్మావతి కట్లాఅంటే రోషం. యీ ఆడపిల్ల అట్లా కోతలు కోస్తుందేమో? అనిపించేది. మేము విన్న పూర్వపుకథలలో మమ్మన్ని

యిద్దర్నీ ప్రవేశపెట్టి, ఆలోచించుకుని పద్మావతితో అప్పుడప్పుడు కధలు మార్చి చెప్పేవాణ్ణి కూడాను.

పద్మావతికి స్వయంవరం; నేనూ కూడా వెళ్ళాను. పద్మావతి నన్ను వరిస్తుందని తెలుసు. పువ్వులదండ తీసుకుని చెలికత్తెతో నావేపు నడిచి వస్తోంది. యింతలో దుష్టుడైన ఒకరాజువచ్చి తటాలున పద్మావతిని లాక్కుని తన రధంలో కూచోబెట్టుకొని పారిపోయినాడు. పద్మావతి నాకేసి చూసింది. నేను వెనకాల రధంలో వెంబడించి, ఆరాజునీ వాడి సైన్యాన్నీ నాశనంచేసి పద్మావతిని రక్షించాను. యింకోసారి భయంకర రాక్షసుడు వొకడు పద్మావతిని సప్తసముద్రాల అవతల వొంటిస్తంభం మేడలో దాస్తే నేను కీలుగుర్రంమీద నాలుగు సముద్రాలుదాటి, మధ్య ఆగుర్రం సీలవూడితే, దాంతోకూడా మూడుసముద్రాలు వొంటిచేత్తోయీది, బరణిలో యీగల్ని నలిపి, రాక్షసిని చంపి, పద్మావతిని రక్షించాను.

యిద్దరం కీలుగుర్రంమీద యెక్కి సముద్రాలన్నీ దాటి వొచ్చేశాం.
"మరి శీలవూడి గుర్రం పాడయిందిగా?"
"ఆరాక్షసి రక్తం పూసేప్పటికి సీల మళ్ళీ అతికింది."
'అట్లానా? సరే తరువాత.

''అప్పుడు నవ్వులేక యేడ్చియేడ్చి మంచమెక్కి చచ్చిపోవడానికి సిద్ధంగావున్న మీఅమ్మగారికి నిన్ను చూపించి "యిదుగోనండీ మీఅమ్మాయి నేను వాగ్దత్తం చేసినట్లు మూడునెలలు కాక ముందే తీసుకొచ్చాను" అన్నాను.

''అంతే?''

''అయ్యో యెంతకష్టపడ్డావు? యింతచిన్నవాడివి. అంత ప్రచండ భయంకర రాక్షసిని యెట్లా చంపగలిగావు? ''అంటుంది మీఅమ్మగారు. జబ్బంతాపోయి లేచికూచుని. "యేముందండి; యెంతపని? పద్మావతికోసం మూడులోకాలూ రాక్షసులైనా, అందరినీ చంపుతాను.''అంటాను అప్పుడు నువ్వు సిగ్గుతో నావంకచూసి తలవొంచుకుంటావు.

"వొంచుకోను. నిన్ను చూస్తే నాకు సిగ్గెందుకు?"
"కథలో అట్లాగే చెయ్యాలి."
" కథలో అయినాసరే అట్లా వొప్పుకోను"
"అయితే కథచెప్పను."
"సరేలే వొంచుకుంటా. చెప్పు తరవాత"

"మీఅమ్మగారు సరేనాయినా! మాఅమ్మాయికోసం నువ్వింత కష్ట పడ్డావు. నీకంటే నాకు అప్తులెవరు. యీపద్మావతిని నీకిచ్చి పెళ్ళి........"

నాగూబ గుయ్యిమంది; కళ్ళముందు వెయ్యిసూర్యులు తళతళ మన్నారు. దవడపగిలింది. కర్రచేసి ముక్కాలు యెగరేస్తో, చురు క్కుమన్న చెయ్యిని పద్మావతి తొడకి రాసుకుంటోంది- కోపంవొస్తే పద్మావతి యెవర్ని లెక్కచేయదు కాని అప్పుడప్పుడు నిష్కారణంగా కోపంవొచ్చేది. ఒకసారి ఆపిల్ల కర్రఒకటి విరిచాను. అది పుచ్చుది "నాకర్ర యెందుకు విరిచావు? అట్లాంటిది యింక దొరకదు-" అంటుంది. నేను "అదిపుచ్చుది అంతకంటె మంచిది తెచ్చియిస్తా"నంటాను- దానికి గండు పిల్లిలాగ నామొహమంతా రక్కింది- ఆడపిల్ల. యెట్లా కొట్టను? పాపం సుదర్శనం యెంతలాగినా వొదలదు."యింకాపుచ్చుది, అంటావూ? అంటావూ?" అంటో వకటే రక్కడం, యింకోసారి తనకంటే బాదం పప్పులు తోటవాళ్ళ అమ్మాయికి యెక్కువ యిచ్చాననని, అన్నీ నామొహా నేసికొట్టింది, "నాకు తెలుసులెద్దూ. నాకంటె ఆఅమ్మాయిని చూస్తేనే నీకు యిష్టం. పో, ఆపిల్లతో ఆడుకో-పో" అంది.

మునుపు ఆడపిల్లలంటే హీనంగా చూసేవాణ్ణి. కాని యిప్పుడు పద్మావతిని చూసిన తరవాత వాళ్ళంటే గౌరవం యెక్కువయింది. నేర్పరుగాని, నేర్చుకుంటే తిడతారుగాని ఆడపిల్ల గోలీకాయలు, సూటిగా కొడుతుంది; చెక్కిం పడకుండా మనుషుల కాళ్ళళ్ళోంచి దొర్లిస్తుంది; చెట్ల చిటారుకొమ్మలికి యెక్కుతుంది; దెబ్బతగిలేట్టు గుద్దుతుంది. మొగపిల్ల లంత బాగాను; పైగా రక్తం కారేట్టు రక్కుతుంది.

ఆ దినాలు మరుపుకురావు, చెట్లనీడల్లో, పువ్వుల వాసనల్లో, సాయంకాలపు చల్లని గాలులలో, వెన్నెలల్లో, పద్మావతీ నేను ఆడిన ఆటలూ, పాడిన పాటలూ, చేసిన అల్లరీ, అన్నీ జ్ఞాపకంవున్నాయి, సత్యవతమ్మగారితో కూడా నాకు స్నేహమే. చీకటి పడగానే పిల్లలందరం ఆమె కుర్చీ దగ్గిరచేరి కథలు చెప్పమనేవాళ్ళం, మేడముందు గచ్చు మెట్ల మీద ఆమె కాళ్ళ దగ్గిర కూచుని తాడిచెట్టుమీద మెరిసే శుక్రిడివంక చీకట్లోచూస్తో, దూరంగా చెట్లలో గాలి వూగుతూవుంటే, మాదగ్గిరకి యెప్పుడువస్తుందా అని యెదురుచూస్తో, పాండుకుమారుల బాల్యకథలు వినే వాళ్ళం. అప్పుడెంత సంతోషంగావుండేది। దిగులు ఒకటే. తెల్లారితే బడి.

చిన్నతనం చాలా సంతోషమైన కాలమంటారు. హాయిగా చీకు చింతా లేకండా, భోజనం, చిరితిండీ, బట్టలూ, ప్రేమగలదేవత మాకు సంసిద్ధంచేసి యిస్తోందనే వుద్దేశ్యంతో, తిరగడం, ఆడుకోడం, బాగా వుంటుంది. యీపెద్దవాళ్ళు యెందుకో చీదరించుకుంటో, కోప్పడుతో, యేడుస్తో, బతుకుతారు? అట్లా బతక్కపోతేనేం? ఆకాశం, మబ్బులూ, పువ్వులూ, పిల్లలూ, చిలకలూ, రైళ్ళూ, నీళ్ళూ యిన్నివుండగా యీపెద్ద వాళ్ళకి సంతోషం లేకపోవడమేమో? అని సందేహం. కాని దురదృష్టం, యిన్ని అందమైన వస్తువుల్లోను, బడీ, బెత్తం మాష్టరుమొహం, యీ మూడువస్తువులు కూడావున్నాయి. పిల్లలు అనుభవించే సంతోషాన్ని చూడలేక కళ్ళుకుట్టి, యేదయ్యం సృజించిందోగాని యీమూడింటినీ, యీయెండనీ, వెన్నెళనీ, చెట్లనీ, చేసినదేవుడు చెయ్యలేదు. జెర్రెలూ, తేళ్ళూ, రోగాలూ, పుట్టించిన సైతాను వీటిని కూడా కల్పించివుండాలి. యెంతో ఆనందంగా గంతులు వేస్తున్నవాడల్లా, గంటవిని, చమటలో నానిన ఆపాతటోపీ నెత్తిమీద పెట్టుకుని, యెక్కడెక్కడో పారేసిన చింకిపుస్తకాలన్నీ వెతికి చాతపట్టుకునేప్పటికి, యెక్కడలేని విసుకూ, నిద్రా, విచారం వొస్తాయి. కాళ్ళీడ్చుకుంటో, యెండలో పోవడం, సాయంత్రందాకా, కాలూ, చెయ్యి కదల్పకుండా కొయ్యబల్లమీద కూచోడం, యిదిచదివావా? అదితెలుసునా? అని ప్రశ్నలూ, చెప్పకపోతే కోపం, దెబ్బలూ, చెమటా, చీదరా, దుమ్మూ, వాసనా, యెందుకో యీపరికారం

పిల్లల ప్రాణాలు తియ్యడం! ఆక్బరు యెన్నో యేట సింహాసనమెక్కితే నాకేం? కాశ్మీరదేశం అడవుల్లో యేంపండితే నాకేం? యెన్నడూ జన్మలో అప్పుయివ్వను, పుచ్చుకోను, యిచ్చినా వొద్దీతీసుకోను, అన్నా వదలరు గదా ఆవొడ్డీలెక్కలు చేయించకండా? ఇదయ్యాబడి! బడిభూతాన్ని తగిలించి, చిన్నతనం సంతోషమైన కాలమంటే యేమన్నా అర్థముందీ? మామాష్టరు మొహం చూస్తేచాలు, యెప్పుడూ కోపమే, యేడుపే. తను బతికి, యెందుకు మమ్మన్ని యిట్లా యేడిపిస్తాడో తెలీదు. ఒకసారి మాయింటి పక్కనవున్న కాలవలో పడకూడదూ! ఆపాడుబతుకు బతక్కపోతే! బడిరోజుల్లో పడితే మాకోరోజు శలవన్నా వొచ్చేది!

పద్మావతిపెళ్ళి దగ్గిరికొచ్చింది. పెళ్ళిప్రయత్నాలు చూస్తే మాకు సరదా, పందిళ్ళనీడలు, కొత్తతాటాకుల చల్లనివాసన, రంగుకాయితాల ముక్కలు, తళుకురేకుల పీలికలు, అద్దంపెంకులు, ఇవన్నీ ఏరుకుని ఆడుకొనేవాళ్ళం. పద్మావతికి చిన్నఅద్దంపెంకు బొట్టుపెట్టి "పట్టంచు చీరకట్టి అద్దాల రెవికతొడిగి" అని ఆడేవాణ్ణి, పెళ్ళిరోజు ఎప్పుడొస్తుందా అని ఉండేది నాకు. పద్మావతికి పెళ్ళంటే సంతోషమూలేదు, సిగ్గూలేదు. పెళ్ళికొడుకుని యేమన్నాఅంటే వుడుక్కునేదికాదు. అదేం ఆడపిల్లో!

ఒకరోజురాత్రి నేను నిద్రపోయినాననుకునిగావును, మాఅమ్మా నాన్నా మాట్లాడుకుంటున్నారు.

"వాళ్ళ పద్మావతి యెంత బావుంటుందనుకున్నారు! పెద్దదైతే యింకా అందంతేలుతుంది. అంత అందమైన మనిషిని చూడరు."

"అవును వాళ్ళతల్లి అంత అందంగావుంటే పిల్లలువుండరూ?"

"మనఅబ్బాయికి యివ్వకూడదూ? కళ్ళనద్దుకుని చేసుకుంటాం. కట్నం వొద్దు యేంవొద్దు. పిల్లే కట్నం. యీడుజోడుగా ఉంటారు. ఆముప్పైయేళ్ళవాడికి యివ్వకపోతే...."

"కట్నం యిస్తేనేం, వాళ్ళకిలోటా? సత్యవతమ్మగారు యిటాంటి పెళ్ళి చెయ్యదనుకున్నాను. బంధువుడవి పెద్దవాడి కెందుకియ్యడము?

యింతకీ మనకిస్తారూ ? ఆయన ఇంగ్లండుకు వెళ్ళి పెద్దపరీక్షలకి చదువుతాట్ట ?"

"ఆ, ఆయనవొచ్చేటప్పటికి ఈమెగారికి యిరవైయేళ్ళు వొస్తాయి. యిప్పుడే యిట్లా మొగపిల్లలతో చెలైక్కుతోంది. ఆయనగారు వొచ్చేటప్పటికి........"

పద్మావతి అందంగా వుంటుందంటే యేమిటో అప్పుడు నాకు తెలీదు. యెర్రని జుట్టు గాలికి యెగుర్తో, పలచనివొళ్ళూ, సన్ననికాళ్ళూ, కదుల్చుకుంటూ, పరిగెత్తడం జ్ఞాపకముంది. ఆ అమ్మాయి చర్మంలో మాత్రం అప్పుడే యేదో మెరుపువుండేది. వూరికే ముట్టుకోవాలనిపించేది. కాని రక్తుతుందని భయం. కాళ్ళూ, మెడా, సన్నగా అసహ్యంగావున్నా కళ్ళు తళతళ మెరిసేవి. నవ్వకపోయినా, పెదిమలు నవ్వుతున్నట్టే కనపడేవి.

పెళ్ళివారు వొచ్చారు. పెళ్లికొడుకు సత్యవతమ్మగారి తమ్ముడే. పేరు న్యాయమూర్తి. రెండోపెళ్లి కాని యిరవైఅయిదేళ్లవాడు. ఆయన దొరటోపీ। సులోచనాలూ, బూడ్సులూ, చూశేటప్పటికి యేదేవేందు్రిడో దిగినట్టుంది. నాకళ్ళకి, పద్మావతికి మాత్రిం భయంలేదు. అప్పుడు బి ఏ అంటే దేవతలవంటి మనుష్యులు చదివేదని మావుద్దేశ్యం. యింజనీరింగు చదవడానికి రెండునెలల్లో ఆయన యింగ్లండు వెడతాట్ట.

పెళ్లి మొదలుపెట్టారు. పద్మావతికి పసుపురాసి, బుగ్గన చుక్కపెట్టి కొత్తపసుపు చీరెకట్టి, ఆయనముందు తలవొంచి కూచోపెట్టారు. నేను వెళ్ళి నాతలకూడావొంచి "యేం ?" అన్నాను. మెల్లిగా బుగ్గలో నాలిక పెట్టి వెక్కిరించింది. ఆపెళ్లి రోజుల్లో యేమోగాని, నామనసులో, పద్మావతి నాదిలాగా ఆఅమ్మాయిని వాళ్లేదో బలవంతంచేసి పెళ్లిచేస్తున్నట్టూ నాకు యెవరితోనూ చెప్పుకోడానికి అర్థంగాని బాధగా వుండేది. కాని ఆతమాషాలో నాకు ఆబాధ అప్పుడు కనపడలేదు. వాళ్ళిద్దరి చెంగూచెంగూ

ముడేస్తే, ఆపిల్ల మెళ్లో ఆయన పూసలు కడితే, నాపద్మావతిని, ఆయన తనదాన్ని చేసుకుంటున్నట్లుండేది. పద్మావతి ముక్కు మొహం యెరగని ఆయన, ఆఅమ్మాయిచేత దెబ్బలుతినని ఆయన, ఆఅమ్మాయికేమి యిష్టమో తెలుసుకుని, అట్లానే ప్రవర్తించి, ఆఆటలే ఆడుకోడం తెలీని ఆయన; రాత్రి పగలూ నవ్వుతూ, పాడుతూ, ఆపిల్లతో చేతులూ చేతులూ, కలుపుకు తిరగని ఆయన యెవరో తటాలునవొచ్చి యేన్యాయం ప్రకారం నాపద్మావతి మెళ్లో అవన్నీకట్టి, నన్నుకూడా పద్మావతి ముట్టుకోనియ్యని, ఆమెడకి గంధంరాస్తాడు? పద్మావతిని వాళ్లేదో, బాధపెట్టినట్టూ అవమానపరచినట్టూ అనుకుని, ఆపిల్ల సుదర్శనంతో పోట్లాడినప్పటివల్లే, నేనేదో కాపాడేవాడిలాగ, నాసహాయంకోసం పద్మావతి యెదురుచూస్తున్నట్లు, ఆఅమ్మాయికి దగ్గిరగా వుండేవాణ్ణి. కాని పద్మావతికి పెళ్ళి చాలసంతోషం; గర్వంకూడా వొచ్చింది. పలకరిస్తే నావొంక చూసేదికాదు. ఒకసారి నాకు యేడుపుకూడా వొచ్చింది. పద్మావతికి గంధంరాశాను.

"చూడు, అత్తయ్య; యితను మరీని!" అంది.

నాప్రాణం చివుక్కుమంది. ఆకొత్త ఆయనచాత వొళ్ళంతా గంధంరాయించుకోవొచ్చేం? పెళ్ళిఅంటేసరి ఆడపిల్లలకి చాలా పొగరెక్కుతుంది.

పెళ్ళి అయిపోయింది. అందరూ వెళ్ళిపోయినారు. యెప్పటిపిల్లలం మిగిలాము. పద్మావతికి గర్వంపోయింది. అప్పుడప్పుడు ఆబంగారుచిప్పలు చొక్కాలోంచి కనపడడంతప్ప బేధమేమీలేదు. ఆమొగుణ్ణి వెక్కిరించే వాళ్ళం. పళ్ళుబిగించి మెరిసే ఆపళ్ళు యెర్రచేసి జుట్టుమెగుర్తో, దూకేసి; సివంగిపిల్లలాగు. యెక్కడి వాళ్ళం అక్కటికి పారిపొయ్యేవాళ్ళం.

రెండునెలలయింది. వారంరోజుల్లో సత్యవతమ్మగారూ పిల్లలూ, చెన్నపట్నం వెళ్ళిపోతున్నారు. నాకు పద్మావతి వెళ్ళిపోతుందనే దిగులు పట్టుకుంది. యీలోకంలో నాకు తెలిసినవాళ్ళందరూ వొకసారిగా మాయమైనా నాకంత దిగులు వేసేదో లేదో!

ఒకరోజు మధ్యాహ్నం నేను జామచెట్టుమీద కూచున్నాను. కింద కొమ్మమీద పద్మావతి కూచుంది.

''మళ్ళీ యెప్పుడొస్తారు?''
''యింకరాముట''
''యేం?''
"పనేముంది? అక్కడే చదువుకోడం అంతా"
''అయితే యింకెప్పుడూ కనపడవూ?''
"కనపడకపోతేనేం?''
"నీకు దిగులులేదూ, నేనుకనుపడనని?"
"యెందుకుదిగులు? యేమిలేదు."

నన్నామాట చాలా బాధపెట్టింది. కొంచెంసేపుండి మళ్ళీ పద్మావతి "నువ్వెప్పుడూ చెన్నపట్నం రావూ?" అంది

''యెందుకు?"
"వొస్తే నన్ను చూడవచ్చు"
"కాని యెందుకు వస్తాను?"

"యెందుకన్నాను! జబ్బుచేస్తే వొకవేళ. మాచిన్నాన్న కొడుక్కి జబ్బుచేస్తే తీసుకొచ్చారు"

"మానాన్నగారు తీసుకొస్తారోరారో"
"పెద్దజబ్బు చేస్తే తీసుకొస్తారు"

"అయితే బాగా వానలో తడవడం, పచ్చిజామకాయలు తినడం చేస్తా. ఆఖరికి పెద్దజబ్బుచేసినా తీసుకురారేమో! మాపెద్దమ్మకి చాలా జబ్బు చేసి చచ్చిపోయింది కూడాను; అయినా చెన్నపట్నం తీసికెళ్ళలేదు. యెందుకు చెన్నపట్నం తీసికెళ్ళడం?"

"అక్కడో పెద్దహాస్పెటలు వుంది?"
"మీరా హాస్పెటలులోనేనా వుండడం"
"ఛా, కాదు చాలాదూరం మాయిల్లు."
"వుత్తరం రాస్తావా పోనీ?"
"మీనాన్నగారిపేరూ, అదీ రాసియ్యి రాస్తాను"
"సరేలే"
కాసేపు మాటాడకండా కూచున్నాము.
"పద్మావతీ, నిన్నెప్పుడూ మరచిపోను."
వూరుకుంది.
"యెప్పుడూ నీమీదే ప్రేమవుంటుంది, నాకు" అన్నాను.
"ప్రేమవుంటే పెళ్ళిచేసుకుంటారుకదూ?"

"అవును నిన్నే పెళ్ళిచేసుకోవాలి నేను....మరియెట్లా?.... ఒక వేళ ఆయన ఇంగ్లండునుంచి మళ్ళీ రాకపోతె....లేకపోతే నిన్ను మరచిపోతే"....

"మరిచిపోడు. నన్నుమరిచిపోతే అమ్మ వూరుకోదు"
"నన్నుచూస్తే నీకు యిష్టమేనా"

"అప్పుడప్పుడు ఆవెనకాల జుట్టుముడిచూస్తే అసహ్యంవేస్తుంది. నీచొక్కా వాసనేస్తుందికూడాను. లేకపోతే యిష్టమే."

"నీదగ్గర కత్తిరవుందా?" వుండదని తెలుసు. అయినా అడిగాను.

"లేదు"

జేబులోంచి చాకు తీసి వెనక చుట్టిన జడని మెల్లిగా కోసి, పద్మావతి చూడకండా మీదపడేశాను. అదిరి కిందికి దూకింది.
"యిదేమిటి? పామనుకున్నా....వెనక్కితిరుగు....అమ్మో....."

పెద్దనవ్వు నవ్వుతూ దొర్లుతోంది.

"అదేమిటి? ఆ ఆ.... మొండి.... జుట్టు...అట్లా వేళ్ళాడుతోంది? యిదివరక్కంటే... అసహ్యంగా ఉంది."

యింటిదగ్గర దెబ్బలకన్నా లక్ష్యంపెట్టకండా యింతా చేస్తే— గుండె చివుక్కుమంది.

సత్యవతమ్మగారూ, పిల్లలూ, చెన్నపట్నం వెళ్ళారు. మళ్ళీ నేనా తోటలో అడుగుపెట్టలేదు నాకు కొన్నిరోజులు యేమితోచలేదు. పద్మావతి దగ్గిరికి యెట్లాగోవెళ్ళినట్లూ, స్టేషన్‌లోనే ఆపిల్ల కనపడ్డట్టూ, నాజబ్బు పోయి, వెంటనే మేమాడుకున్నట్టూ, కలలువొచ్చేవి. యేమేమిటో ఆలోచించుకునేవాణ్ణి. నేను ఆఅమ్మాయితో ఆడినవీ, ఆడనివీ అన్నీ నాబళ్ళో స్నేహితులతో కథలుగా చెప్పేవాణ్ణి.

యింతలో నాకు పెళ్ళికి ఒకసంబంధం వొచ్చింది. పెద్దకట్నమిస్తామన్నారు. అమ్మ చెయ్యాలని పట్టుపట్టింది, నాన్నగారు నేను బి. యే. అయితేనేగాని చెయ్యనన్నారు. అమ్మమ్మ పెట్టినగోలకి పరిమితిలేదు. 'నామనమడి పెళ్ళి నాకళ్ళారా చూడనియ్యవురా? నేను చచ్చింతరవాత పీడవొదిలిందని హాయిగా పెళ్ళి చేసుకుంటారా? గడ్డం మీసం వాడికి వచ్చింతరువాత వాడికేం పెళ్ళి?' అని వొకటే యేడ్చింది.

కాని మానాన్నగారు లొంగలేదు.

—•—

# పద్మావతి

యేడేళ్ళయిపోయింది. నేను బి. ఏ. పరీక్షకు చెన్నపట్నం వెళ్ళి యెండాకాలపుశలవలకి యింటికివొచ్చాను. యేలూరు చదువుకోడానికి వెళ్ళిన మూడునెలల్లో చిన్నపద్మావతినీ అందరినీ, మరిచిపోయినాను. కొత్తస్కూలు, కొత్త టీచర్లు, పుస్తకాలు కొత్తస్నేహితులు కొత్త అనుభవాలు. వీటిల్లో పద్మావతి నిలుస్తుందా? శలవల్లో యింటికివచ్చి తోట వేపు చూసినప్పుడల్లా పద్మావతీ, మాటలూ జ్ఞాపకం వొచ్చేవి. పద్మావతి మళ్ళాయిక్కడకి రాకూడదా, యెప్పుడన్నా అనుకునేవాణ్ణి. మాఅమ్మ చచ్చిపోయింది, నాకెన్నో పెళ్ళిసంబంధాలు వొచ్చేవి. కాని నాన్నగారే వాళ్ళందరినీపంపించేశారు. ఆయనపెన్షన్‌పుచ్చుకొని ఆయింటోనేస్థిరపడ్డారు.

నాచదువు పూర్తి అయింతరువాత నేను చెయ్యవలసింది యేమిటని ప్రశ్నవొచ్చింది. నాకు గవర్నమెంటునౌకరీ చేయడం హీనసత్వంగా కనపడ్డది. ముఖ్యం నాకు అందరూ సాధారణంగా చేసేపనులుగాక యేదో కొత్తది, గొప్పది, యెవ్వరూ చెయ్యంది, చెయ్యలేనిది. చెయ్యాలని వుండేది. ఆకాలంలో విద్యార్థులకి కొత్త వుత్సాహముండేవి. దేశోపకా[illegible] రింటలు. అందరికీ తిలక్, గోఖ్లే, పాలూ, మానసిక గురువులు. వారి వల్లే దేశోపకారం మాత్రమే చెయ్యాలనీ. వాళ్ళలాగే వారికి వున్నంత కీర్తి గౌరవం సంపాదించాలని వుండేది. యీసంగతులే యెప్పుడూ మాలో మేము మాట్లాడుకునేవాళ్ళం. నాకింకా స్త్రీ, పెళ్ళి, యీహాపోహాలు, జీవితంలో బాగా ప్రవేశించలేదు. అప్పుడప్పుడు ఆడవాళ్ళని చూసి వాళ్లూ వీళ్లూ బాగున్నారనుకునేవాణ్ణి, అంతే. హాస్టల్లో పెళ్ళిళ్ళు అయిన వాళ్ళు, పిల్లలు వున్నవాళ్లుకూడా వుండేవాళ్లు. కొందరు యెప్పుడూ వాళ్ళ పెళ్లాల సంగతే మాట్లాడుకునేవాళ్లు. కొందరు స్త్రీల సంగతి అసహ్యంగా అగౌరవంగా మాట్లాడి ఆనందపడేవాళ్లు. ఒకసారి మావాళ్ళ యింట్లో పెళ్ళికి భోగంవాళ్ళు వచ్చి ఆడారు. అందులో వొకపిల్ల చాలా బావుంది. మాపెద్దనాన్నకొడుకు, ఆపిల్లని యెరుగుదుననీ. నువు దాన్ని చూస్తే చాలా యిష్టమనీ అన్నాడు. అతను ఆపిల్లతో యెట్లా స్నేహం చేసుకున్నదీ అడిగాను. స్త్రీని కొనవచ్చునని బాగా మనసుకి తెలిసేప్పటికి నాకు ఆశ్చర్యం, సిగ్గూ వొచ్చింది.

ఆడ ళ్ళంటే గౌరవం తగ్గింది కాని యెట్లానయినా ఆపిల్లని కొనాలని పించింది. ఒకరోజు రాత్రి ఆపిల్ల యింటిదగ్గిరికి వెళ్ళాను. గుమ్మంలో ఒక ముసలామె కూచునివుంది. ఆమెదగ్గరికివెళ్ళి పలకరించాను ధైర్యంతో. మళ్ళీ ఆవేపు వెళ్ళలేను.

ఒకసారి పడవలో వెడుతూవుంటే, పక్కగదిలో యెవరో యెక్కారు. గదులకి మధ్య తలుపులేదు. వాళ్ళలో ఒకచిన్నది, నాకేసి ప్రేమతో చూసిందనుకున్నాను. మధ్యతోవలో వాళ్లు యేదో వూళ్లోదిగితే నేనూదిగి, వాళ్ళ బండివెనకాలే నడిచి పదిమైళ్లూ వెళ్లాను. ఆరోజల్లా వాళ్ళ యింటిచుట్టూ తిరుగుతో ఆవూళ్ళోనేవున్నా. మళ్ళీ ఆఅమ్మాయి కన పడలేదు. తిరిగి వొచ్చేశాను. ఒకవేళ కనపడితే, యేంచెయ్యాలనో నావుద్దేశ్యం? నాకే తెలీదు.

మాబంధువుల యింట్లో యింకోపెళ్ళి జరిగింది. ఆవియ్యాలివారి యింటో పాతికేళ్ళఆమె ఒకామెవుంది. భర్తకూడా పెళ్ళికివొచ్చాడు. ఆమె నావంక కోర్కెతో చూస్తున్నట్లు అనుకున్నాను. ఆమెభర్త కావలసి నన్ను పలకరించి నాతో స్నేహం చేసుకున్నాడు. ఒకరోజు పాటకచ్చేరి అవుతోవుంటే అందరం గాసులైటు వెలుతురుకింద కూచున్నాము. ఆమె నావంకే చూస్తోంది. నేను ఆమెవంక చాలాసార్లు చూస్తున్నాను. కాటిక రాసుకున్న ఆమెకళ్ళూ, గంధం రాసుకున్న ఆమె మెడా, బిర్రుగా బిగిసి వున్న ఆమె మొహమలు రెవికా, చిన్న బంగారువడ్డాణం, అన్నీ అం దంగా కనపడ్డాయి. ఆమె అందం, అత్తరువాసనా, సంగీతం, అన్నీ విడ తియ్యకుండా నామనసులో కలిసిపోయినాయి. యిద్దరం దగ్గిరికి జరుగు తున్నట్టేవుంది. నాకు చేతులూ, కాళ్ళూ లాగాయి. అర్థంకాని బాధవొకటి నన్నావరించింది.

కదలకండా ఆమె సమీపంలో కూచోలేక లేచిపోయి వరండాలో నుంచున్నాను. యింతలో తలుపులోంచి వెళ్ళినట్టుంది. చుట్టుతిరిగివొచ్చి నావెనకాల ఆమెనుంచుంది. చీకటిగావుంది, రాత్రి. నామీద వేడిగా చెయ్యివే సింది, కాళ్ళవొనికాయి, నరాలన్నీవూగులాడాయి. కళ్ళుతిరిగాయి. వొణుకు తున్న వేళ్లతో ఆమెచేతిని పట్టుకున్నా, భయమేసింది. వన్ను ముద్దుపెట్టు

కుంటే నేనూ పెట్టుకున్నా. సరిగా చాతకాలేదని కాబోలు వెకిలిగా మెల్లిగా నవ్వింది. ఆమెకూడా భయపడుతోందని అనుకున్నాను. అట్లానే నుంచున్నా. తరవాత యేంచెయ్యాలో ప్రయత్నించినా తోచలేదు. చొక్కా పట్టుకొని ఆమెలాగింది. వెంట వెళ్ళాను. సగందూరం వెళ్ళేటప్పటికి, ఆనల్లని కోతిరూపంభర్త నాతో స్నేహం చెయ్యడానికి రావడం కనపడ్డది. వెనక్కి తిరిగి వొచ్చేశాను. అసహ్యమో, జాలో, చెప్పలేను. పెడితే యెక్కడికి తీసుకువెళ్ళేదో? తక్కిన రెండురోజులూ, ఆమె నావంక చూడలేదు. మళ్ళీ ఆమెతో వెళ్ళాలని చాలా అనిపించింది. వెళ్ళి, అడుగుదామా అనుకున్నా; కాని ధైర్యంచాలలేదు.

యింకా యిట్లాంటి సంగతులు కొన్ని సగం జ్ఞాపకమున్నాయి. కాని అవేవి జీవితానికి అతకలేదు. మరుపు మబ్బుల్లో కప్పబడ్డ ఆమొహాలన్నీ యేమైనాయో! వాళ్ళలో యెవరికన్నా నేను జ్ఞాపకమున్నానేమో!

నేను పరీక్షకు చెన్నపట్నం వెళ్ళినప్పుడు అక్కడ వెంకటరత్నం, సుదర్శనం కనపడ్డారు, యిద్దరూ యెదిగారు; కాని ఆట్టే మారలేదు. నన్ను చూచి

"యేమిటి? యిట్లా సాగిపోతున్నావు? నువ్వేనా! నిన్ను నాలుగు పెట్టి యెవరన్నా హెచ్చవేశారా? అన్నారు"

వాళ్ళూనాతోనే సుందరపురం వచ్చివేశారు. పద్మావతీ సత్యవతమ్మగారూ అక్కడే వున్నారుట. మరునాడు వాళ్ళని చూడ్డానికివెళ్లాను. ముందు అద్దం చూసి షోకు చేసుకున్నాను. యిప్పుడు మునపటిమల్లే కాదు, నాక్రాపింగు జుట్టుకంటె నున్ననిదీ, మెట్లున్నదీ యెవరికీలేదు. సూర్యుడి కిరణాలన్నా వొంకర తిరుగుతాయిగాని నాపాపిడి తిరగదు. నాచిన్న మీసాలూ, చలించేకళ్లూ, కడ్డీవంటి సన్ననివొళ్లూ ఎంతో అందంగా కనపడుతోవుండాలి అనుకునేవాణ్ణి. రోడ్డుమీద నావంకచూచేవాళ్ల చూపులూ కొంచెం దూరంవెళ్ళి వెనక్కిచూస్తే యింకా నామీదే నిలిపివున్న స్త్రీల దృష్టులే చెప్పేవి ఆసంగతి నాకు. అద్దంముందు నుంచుంటే నామీద నాకే అమితమయిన ప్రేమకలిగేది. నేనే ఆడదాన్నై యెవరిభార్యనో అయి నేను యిప్పుడున్న రూపముగల పురుషుణ్ణే చూస్తే; ఆభర్తని వొదిలి

అటువంటివాడి వెనక పరిగెత్తక పొయ్యేదాన్నా అనిపించేది. తెల్లని మల్లు పంచలూ, సైకిలుకట్టూ, షైని, మెరిసే పేటెంటు లెదర్ బూట్సులూ, ట్వీడు కోటూ, సెంటువేసిన జేబురుమాలా, సిల్కు కండువాలు, చెప్పడమెందుకూ ఆలోచించుకోండి యెట్లావుండేవాణ్ణో!

తోటదాటి మేడదగ్గిరికి వెళ్ళేటప్పటికి ముందు యెవరో మొగాళ్ళతో కూచుని మాట్లాడుతున్న సత్యవతమ్మగారు కనపడ్డారు. నన్ను చూసి చాలాఆదరణగా కూచోపెట్టి, సంగతులన్నీ అడిగారు. ఆమె మొహంమీద ముడతలూ, తలమీద తెల్లవెంట్రుకలూ యెక్కువైనాయి.

"యెంతపెరిగావు? సుదర్శనంకూడా యింత పొడుగనుకోను. పద్మావతి నిన్ను గుర్తుపట్టలేదనుకుంటా, చాలా సంతోషంగావుంది మమ్మల్ని మరచిపోకండా వొచ్చావు," అంది.

యింతలో వెంకటరత్నం వొచ్చాడు. వెంకటరత్నం వెనకాలే లేత నీలం సిల్కు చీరెకట్టుకొని గంధర్వ కన్యలాగు ఒకరూపం కనపడ్డది. సన్నగా పొడుగ్గా గాలికివూగే పుదించిన సవుకుచెట్టు మల్లేవుంది. చర్మము అతినునుపు. దానినిండా యెర్రని జీవనశక్తి ప్రవహిస్తున్నట్లుంది. యెర్రని పెదిమెలు, నవ్వుతున్నకళ్ళు, ముందుకు వొంపుతిరిగిన బుజాలు మెడా, నా వేపు నడిచివొచ్చాయి.

"అదిగో!" అని

చేతులో ఒకపూలకొమ్మ ఆడిస్తో పద్మావతి వచ్చింది. అటుతరవాత నేనేం మాట్లాడానో, ఆమె యేమన్నదో యింకెవరేమన్నారో, యేమీ జ్ఞాపకంలేవు. జ్ఞాపకమున్నదల్లా ఒక హృదయానుభవమే! ఆమె, యెట్లా కదిలిందో యెప్పుడు నన్ను చూసి చిరునవ్వు నవ్విందో. యెట్లా కూచుందో కాలుకదిలించిందో; అన్నీ జ్ఞాపకమున్నాయి. యేం మర్యాదా, చాతుర్యమూ నేర్చుకుంది! అక్కడవున్న కొత్త పెద్దమనుషులందరితోనూ, లాయర్లతోనూ, సరిసమానంగా, బెరుకు బెణుకు లేకుండా మాట్లాడేస్తుంది యింగ్లీషులో— అరంతం! ఆమృదుత్వమూ, మాధుర్యమూ, స్వరాల ఆరోహణలూ, యెన్నడూ గుర్తించలేనే అనుభవం.

ఆమె నాతో మాట్లాడితే నాకు బదులు మాటరాదు. ఈమెతో మాట్లాడడానికి నాకేముంటుందా అనిపించింది. నేనూ బి. ఏ. ప్యాసయినాను. యేమీ తక్కువవాణ్ణికానని, జ్ఞాపకం తెచ్చుకుంటేనేగాని, కొంచెం ధైర్యం వొచ్చిందికాదు. చిన్నప్పటి యెర్రనిజుట్టూ, సన్నని మెడా, కాళ్ళూ మాయమయినాయి. చెంపలపైకి వొచ్చేట్టు చక్కగా ముడివేసుకున్న జుట్టూ, యెత్తవుతోవుండే రొమ్మును కప్పని, మెడకిందికి కత్తిరించిన చీనాసిల్కుజాకెట్టూ నాకళ్ళని ఆకర్షించేశాయి.

యింటికి వెళ్ళేంతరవాత పద్మావతిని గురించి ఆలోచించుకున్నాను.

పద్మావతి యిట్లావుందేమా అని ఆశ్చర్యంవేసింది. ముందుగా యెట్లావుంటుందనీ ఆలోచించనేలేదనుకుంటా. యేదో పూలు అల్లుకుంటో వంటింటిదగ్గిర గదిలో కూచుంటుందనో, నన్ను చూడగానే సిగ్గుపడి యింటోకి పరిగెత్తితే, నేను వెనకవెళ్లి

"పాతవాణ్ణేగా. యింతలోనేసిగ్గు!" అని

గొప్పచెయ్యవచ్చుననో, అనుకుని వుంటా. కాని తనేముందు రాణిలాగు నాదగ్గిరికి వొచ్చి, నన్ను పలకరించిన మాత్రాన పరవశపుచ్చి, నేను బిడియపడేట్టు చేసేట్టుగా మారుతుందనుకోలే. యీమా, పద్మావతి,! ఆ కిన్నరకన్య! యెండ పొడలలోంచి ఆకారందాల్చి, ఆశగొలుపుతో నాముందుకు నడిచివొచ్చిన మాధుర్యము! నాచిన్నప్పటి కొంటె పద్మావతి యీమా!

సత్యవతమ్మగారు పద్మావతిని, యిట్లా మొగవాళ్లతో స్వేచ్ఛగా తిరిగేట్టు, యెందుకు పెంచిందని నాకు ఆశ్చర్యం కలిగింది. ఆయేడేళ్లలోనూ యేమి జరిగిందోకాని, నేను చూసేప్పటికి పద్మావతి అట్లావుంది. సాధారణంగా హిందువులయిళ్ళల్లో అది ఆచారంకాదనీ, కొత్త అని తోచింది. తరవాతరోజుల్లో పద్మావతిని అడిగాను. తనని యింతస్వేచ్ఛగా, యెందుకు వుణ్చిచ్చారని.

"మొదటి సంగతి మాఅమ్మకే పట్టింపులేదు. తరవాత నేను ఆమె కిష్టమయిన దానికంటే స్వేచ్ఛగా వున్నానని, అదమాలని చూసింది. కాని అప్పటికప్పటికే నేను ముదిరిపోయినాను. చాతగాక సమాధానం చేసుకుని

వూరుకుంది. అయినా తనకెందుకు యీ భారమంతా. అనుభవించేవారు యింకోరున్నారుకదా? అనుకుంది అనుకుంటా" అని చెప్పింది.

మర్నాడు మధ్యాన్నం మళ్లీ వెళ్ళాను. పద్మావతి నన్ను తోటలో తిరగడానికి రమ్మంది. రాధా మనోహరం జాజీ అల్లుకున్నచోట నీళ్ళకుండు వుంది. చిన్నప్పుడు దాని బిరడాతీసివేసి, నీళ్ళన్ని పోనిచ్చి, తోటవాళ్లని యేడిపించేవాళ్ళం. యిద్దరం అక్కడకూచుని, పూర్వంమల్లేనే తెలిగ్గా మాట్లాడుకున్నాం. చెన్నపట్టం సంగతులు, ఆగ్రాలో తను మొన్నచూసిన విచిత్రాలూ, అన్నీచెప్పింది. నాపరీక్షలూ, స్నేహితులూ, పాఠాలూ, అన్నీ వాగేశా. అప్పుడప్పుడు ఆకోలకళ్ల కొనల్లోంచి నామొహంవంక దొంగ చూపులు చూస్తోంది. నేనెట్లావున్నానో, యెంతమారానో, అనిగావును. ఆమెతో మాట్లాడుతోవుంటే నాకు మాటలు తడబడతాయి. తెలివిగా మాట్లాడుతున్నానా అని సందేహం. మాట్లాడుతో మధ్య ఆమె వొంగితే నడుమువొంపూ, చెయ్యి చక్కదనమూ, చూసి యేం మాట్లాడుతున్నానో మరచిపోతాను. ఆమెమాటలు సంతోషకరమైన రహస్యంమల్లే చెవికి తాకాయి. మృదువైన కంఠస్వరమూ గలగలమనేనవ్వూ సంగీతంమల్లే హృదయాన్ని కలతపెట్టాయి.

ఆకుండు చూసేటప్పటికి పూర్వంసంగతులు జ్ఞాపకమొచ్చాయి.

"అప్పుడు యెన్ని ఆటలు తోచేవి! వాటిసంగతి తలుచుకుంటో వుంటా."

"నేనూను; నీకట్టువొకసారి విరిచేశాను జ్ఞాపకముందీ? అది నేను పుచ్చుదంటాను మంచిదంటావు నువ్వు?

యిద్దరం నవ్వాము. అప్పుడంత స్నేహంగా ఉండేవాళ్లమే యిప్పుడింత కొత్త యెందుకుమనకి? అని యిద్దరికీ తట్టింది.

"అప్పుడు కొట్టినట్టు యిప్పుడు నిన్ను చెంపకాయ కొట్టనుకదా! ........నేను గీకానుకదూ నిన్ను?"

ఆమె అంత చనువుగా మాట్లాడేటప్పటికి నాకు చాలా సంతోషం కలిగింది.

"ఛా, లేదులేదు"

"గీకానులే"

"ఛా లేదు"

"యెందుకు లేదంటావు? వొప్పుకుంటేనేం? మనమిద్దరం పెద్ద వాళ్లం అవుతున్నాము, వొచ్చిన యిబ్బంది అదీ. పోట్లాటవొచ్చినా, యింక కాళ్లూ చేతులు వుపయోగపరచనుగదా?"

అక్కణించిలేచి తోటంతాతిరిగి పెద్ద వేపచెట్టుకిందకి వెళ్లాము. మునుపు ఒకరోజు సాయింత్రం, యిద్దరం దానికింద నిద్రపోతే, మాకోసం వూరంతా వెతుక్కున్నారు.

"మళ్లీ అంత చిన్నవాళ్లం అయితే బావుండదూ?'' అంది.

"అట్లాంటి నిద్ర మళ్లీరాదు'' అన్నాను ధైర్యంచేసి.

యిద్దరం యింటిదగ్గిరికి వొచ్చాము. ముందు ఒకమెట్టెక్కి, తెల్లని, మధ్యగుంటపడి వొంపున్న మెడని నాకళ్ళకి సమానంగా నుంచుని, "చూడు నాకంటె యింకా నువ్వే పొడుగు. యింక యెప్పుడూ నన్ను కిందిదానిగానే చూస్తావు." అంది.

"యెత్తైనా యెప్పుడూ నీకంటె కిందగానే వుంటాలే."

"ఛా, అదికాదు. సమానంగా వుండాలి మొగవాడివి కదూ నువ్వు!''..........

ఆ యెండాకాలమంతా నాయవ్వనం పద్మావతితో నిండిపోయింది. ముందువెనకా తెలియదు. కళ్లు కనపడవు. యెందుకా యేంచేస్తున్నానా, అనే ఆలోచనలేదు. ఆమెనడిచిన నేలమీది దుమ్ముతీసి కళ్ళకద్దుకున్నాను. ఆమెతో తిరగడం, మళ్లీ యెంతత్వరగా ఆమెదగ్గిరికి చేరుకుందామా అని తొందరపడడం, ఆమె కనపడనంతసేపూ, యేంతోచక గిలగిలలాడడం, రాత్రులు కూడా ఆమెనే కలలలోచూడడం, పొద్దున లేవగానే ఆమెని వెతుక్కుంటో వెళ్లడం, యింతేపని ప్రతిరోజును, చాలాసార్లు మాట్లాడే వాళ్ళమే కాదు. చెయ్యిచెయ్యీ పట్టుకుని కిందికి చూస్తో తిరిగేవాళ్ళం మాట్లాడినప్పుడు యెవరు యేది మాట్లాడినాసరే. యెదో కంఠం వినపడు

తోవుంటే చాలు; యెవరం యేంచేస్తున్నా వొకళ్లకి రెండోవాళ్లమేదే కళ్లు; కానీ ఒకరికళ్ళల్లోకి వొకరం సూటిగా చూసుకోము. రాత్రియింటికి చేరు కున్నతరువాత ఆరోజు జరిగిందంతా, చిన్నపనులూ, పొంచాటు మాటలూ, అన్నీ గోరంతయు చేసి, ఆలోచించుకుని, ఆలోచించుకుని, సంతోషించేవాణ్ణి- మళ్లీమర్నాడు యేంచెయ్యాలో లోపలవుద్దేశ్యాలు పైటపడకండా యెట్లా తెలియపరచాలో ఆలోచించేవాణ్ణి.

ఆకుటుంబములో, మేమిద్దరం యిట్లా వొంటరిగా కాలం గడపడం బహుసులభం, పద్మావతిభర్త న్యాయమూర్తిగారు, యింకా ఆదేశంనించి రాలేదు. సత్యవతమ్మగారు, యేవో వ్యాజ్యాల వ్యవహారాల్లో, వూపిరాడ కండా కొట్టుకుంటున్నారు. నేను బంధువుణ్ణి, అనో యేమో నన్ను తమలో వొకణ్ణిగానే చూసుకునేవాళ్ళు. యెవరికీ మాయిద్దరిస్నేహం, వింతగా కన బడ్డట్టులేదు. పదింటికి భోజనమైతే, సాయంత్రిందాకా యెవరెక్కడున్నా రని అడిగేవాళ్ళులేరు. నాచిన్నప్పుడువున్న బంధువులెవరూ, యిప్పుడు వాళ్ళింటోలేరు. సాధారణంగా వెంకటరత్నం, సుదర్శనం, పన్నెండు ప్రాంతాల మాయమయ్యేవాళ్లు. సత్యవతమ్మగారు నిద్రపొయ్యేది. యింటి కంతా మేమిద్దరమే. వూరికే వొకరినొకరు చూసుకుంటో మాట్లాడుకుంటో వుండేవాళ్ళం. చదువుకునేవాళ్లం. యింగ్లీషుకవుల్ని యెంతబాగా అర్థం చేసుకొనేది పద్మావతి! అంతమంచి కంఠస్వరముండి కూడా, పద్మావతికి సంగీతం రాదు. కాని ఆమె, మాట్లాడే ప్రతిమాటా సంగీతంలాగే వుం డేది. కొన్నాళ్ళకి సుదర్శనంవాళ్ళూ మమ్మల్నివొదిలి రోజూ అట్లావెళ్ళ డం వింతగాకనపడి పద్మావతిని అడిగాను.

"యీతోట వెనకాల యిల్లుంది చూశావా? దాంటో యెవరో స్నేహితులు దొరికారు వాళ్ళకి"

"అది యెవరిల్లు?"

"యేమో?"

"అక్కడ యిద్దరు అమ్మాయిలు కనపడతారు కదూ?" తలవూ యించింది.

"వెళ్ళిచూడనా?"

"అక్కర్లేనిపని నీకెందుకు?"
అప్పుడప్పుడు వాళ్ళు వెళ్లకపోతే,
"అన్నయ్యా, వొంటిగంట అయింది.
లేకపోతే యేం? యెవరన్నా చూశారా? వెళ్ళలేదేం యివ్వాళ" అనేది
వొకసారి అట్లాఅడిగేటప్పటికి సుదర్శనం
"అంతతొందరా? పోనీ, మేము తోటలోకివెడతాంల్లే"అనినవ్వాడు.

యెండాకాలంలో ఒకరోజు మధ్యాహ్నం, హాయిఅయిన వానకురిసి వెలిసింది. తళతళమని నీళ్ల బొట్లు, ఆకులమీద మెరవడానికి, మబ్బులోంచి తొంగిచూసే యెండవొచ్చింది. తోటలో పిచ్చికలు గుంపులుచేరి అరుస్తు న్నాయి- చెట్లు తలలువూయించి, మాతలలమీద చినుకుల్నిరాల్చాయి, గడ్డి కొత్తవాసన వేసింది- రెండు పెద్దయింద్రధనస్సులు, యీమూలనించి ఆమూలకి వెలుగుతున్నాయి- మబ్బులచివర తెల్లటివెలుగు కళ్ళుమిరిమిట్లు గొలుపుతోంది- మేమిద్దరం పంటకాలవ వొంతెనమీద నుంచున్నాము- కోవెల కూస్తోంది- రెండు మేకపిల్లలు గట్టున గంతులేస్తున్నాయి. ఉడతలు కిందినించి చెట్లమీదికి తరుముకుని ఆటలాడుతున్నాయి. గొల్లపిల్లవాడు తన మందని పిలుస్తున్నాడు. నాచెయ్యిదగ్గర గొల్లభామ వాలింది. మేమిద్ద రం, పరుగెత్తుతున్న, ఆకొత్త యెర్రనినీళ్ళని చూస్తున్నాము. వొడ్డునించి సన్నని నీళ్ళధార, కాలవలో పడుతోంది. తలలో బొడ్డుమల్లెపూలుతీసి, చీల్చి వొక్కొక్కటే, పద్మావతి నీళ్లల్లోవేస్తోంది. ఆమెవేళ్ళు వొణుకుతున్నట్టు కనపడ్డాయి. నాలో యేదోకొత్త ధైర్యంవొచ్చింది. గుండె బిగబట్టినట్ల యింది. ఆమెతలయెత్తి పక్కగా నావంకచూసింది. నేనుచూశాను సృష్టిలో మహాగంభీరమైన మార్పు, వస్తున్నట్లు తట్టింది. పద్మావతి పెది మలు వొణుకుతున్నాయి, అనుకున్నాను.

ఆమె ప్రక్కకి తిరిగి, నాకు యెదురుగా నుంచుంది, తల కొంచెంగా వొంచింది. సాయంకాలపు యెండలో ఆమెపట్టుజుట్టు మెరిసింది. జుట్టు నించి అగరువాసన నాకువేసి, నాతలతిరిగింది. భయంవేసింది. ఏశక్తో మమ్మల్ని దగ్గిరికి లాగుతోంది. ఆమెమీద చేతులువేశాను, ఆమె కదల లేదు. తరవాత యేంజరుగుతుందో, చూడ్డానికి నుంచున్నట్లుంది. పెదిమలు

బిగబట్టి, నిర్భయంగా నాకళ్ళళ్ళో, చూస్తోంది. ప్రతినరం వొణికింది నాకు. ఆశతో, పదివేలశక్తులు నన్ను, ముందుకు లాగేస్తున్నాయి. ఆమె అందా న్నంతా, ఆమె రూపుని, ధైర్యాన్ని, సాహసాన్ని, నాకు అర్థంగాని దేదో చెయ్యాలనుకోడం; వెనక్కి_తియ్యడం; విద్యుచ్ఛక్తి భాధించినట్లయింది. తెల్లవారేముందు, వెలుతురు కొంచెంగా వొస్తున్నట్లూ, ఆగుతున్నట్లూ, వుం టుందే అట్లావుంది- ఆమె నాదగ్గిరికి కొంచెంగా కదిలింది; వాటంతట అవే కలుసుకున్నాయి- మాపెదవులు.

అదీ మా ప్రేమమొదలు. పద్మావతి ఆరోజుల్లో యెట్లా వుండేది? ఫొటోలు చాలా వున్నాయి, గాని అసలుఅందం వొకటీ కనపరచదు. కూచున్నా, పద్మావతి కదులుతున్నట్లేవుండేది. పువ్వులు వాసనేసినట్లే. సన్నగా గ్రేస్‌ఫుల్ (graceful) గావుండేది. ఉన్నదానికంటె పొడుగ్గా కనపడేది. మొహం మీది కళ వర్ణించడం అసాధ్యం. ఫొటోలో, ఆమె వొంటిరంగు యెట్లాకనపడుతుంది? పద్మావతి అందం, సగం వొంటిరంగు లోనే వుండేది. తెల్లని చర్మంకింద, ఎర్రని సౌందర్య ప్రవాహం వరదలు కట్టినట్లుండేది. అన్నిట్లోకి అందం, నోరుదగ్గర. ఆమెకి యెదోవేళాకోళం, కొంటెతనం, అల్లరి కనపడేది, పెదవులు కలుసుకున్నచోట ఆవొంపులో, ఆమె మాట్లాడితే యింకా వినాలనిపించేది; చివాట్లేస్తున్నాసరే, చాలా తమాషా సంగతులనేది. ఆగి ఆగి వొచ్చేవి మాటలు గుంపులుగా. కళ్ళు యెక్కువ పెద్దవికావు. కాని ఆకళ్ళ తెల్లగుడ్డులో నల్లపాపమెరుపు, సాయంత్రం, వాన ఆకాశాన్ని కడిగిన తరవాత, శుక్రుణ్ణిచూస్తే, తెలుస్తుంది. ఆతెల్లచుక్క మెరిసినంత కాంతిగా, యీనల్లచుక్కలు మెరిసేవి. కను రెప్పల్లో యెంతో ఆకర్షణవుండేది. అంతమధురమైనవీ, దయగలవీ. కళ్ళు నేనింతవరకు యెవరకీ చూడలేదు. కనురెప్పలు వాలివుండేవి. కిం దికి చూస్తోవుంటే, చదువుతోవుంటే, మూసుకున్నట్లే వుండేవికళ్ళు. హృదయంలో అతుక్కునివుంది ఆరూపం. యివన్నీ శాశ్వతంగా నన్ను ఆమెవాణ్ణి చేసేశాయి- వొట్టిశరీరం అందంచూసి, మోహించానన వొచ్చు- అవును, ఆశరీరంలోంచి, కళ్ళల్లోంచి, మాటల్లోంచి చూశాను, ఆమెఆత్మ ఔన్నత్యాన్ని-

మొదటినించీ, యిద్దరం సమానులమల్లే ప్రవర్తించాము. యింకా ఆమే నాకంటె అధికురాలు, నాకామె మీద యెక్కువైన గౌరవం. ఆమె అంతటి ఔదార్యవంతుల్ని, యింతవరకు చూడలేదు. మెల్లి మెల్లిగా ప్రేమ సంపాదించడం, దొంగచూపులూ, దొంగమాటలూ, ప్రయోగించిడం, రెండోవారి అభిప్రాయ మెట్లావుందో కనుక్కోడం, భయపడడం, సూచించడం, అనుమానించడం, ఆశలూ, నిరాశలూ, దొంగతనం అబద్ధం, మెల్లిగా మనసులాగడం, తప్పు అభిప్రాయాలు ప్రవేశపెట్టడం, యివన్నీ మాలో యెన్నడూలేవు. మాప్రేమతప్ప యింకోఆలోచన యెన్నడూ మాకు తట్టనే లేదు. నేను బతకడం, గాలినీ, యెండనీ, అనుభవించడం, యెంత సహజమో, పద్మావతిని ప్రేమించడం కూడా అంతసహజమే. ప్రేమగల స్నేహితులం. అంతే

పద్మావతి నాకంటె తెలివిగలది. సూక్ష్మంగా వెంటనే సంగతుల్ని గ్రహిస్తుంది. నాకంటె విశాలమైన జ్ఞానాన్ని సంపాయించింది- చాలాచదివింది- ఆమెతో మాట్లాడిన తరవాత, నాచదువంతా యూనివర్సిటీ పరిక్షలకితప్ప పనికిరాదని తెలిసింది. నా బి. ఏ. లో నేర్చుకున్న లెక్కలు యెందుకు పనికొస్తాయి, పద్మావతితో వాదించేటప్పుడు? పద్మావతి, చేతికిదొరికిన పుస్తకమల్లా చదివింది. దేశాన్నీ, మనుషుల్నీ, చూసింది. మేము అనేక సంగతులు మాట్లాడుకొనేవాళ్ళం. అంత ప్రేమ వున్నా, అది మామాటల్లో వొచ్చేదేకాదు. వొంటరిగా వున్నప్పుడు ముద్దు పెట్టుకునేవాళ్ళం. చేతిలో చెయ్యేసుకుని నడిచి, చాలా ధైర్యమైనపని, చేశామనుకొన్నాము. ఒకసారి బురద అడ్డమొస్తే, చేతుల్లో యెత్తుకుని పద్మావతిని అవతల దింపేటప్పుడు నాకు గట్టిగా అదుముకొన్నాను. ఆపని యెంతో కొత్త మాకు. తరవాత చాలనాళ్లు వొకరినిచూస్తే వొకరికి సిగ్గు. కాలేజిలో స్నేహితుల మల్లేనే వేళాకోళాలు చేసుకునేవాళ్లం- వుద్దేశ్యాలన్నీ చెప్పుకునేవాళ్లం- ఒకసారి మతంసంగతి మాట్లాడాము- నాకు మతంలో నమ్మకం- పద్మావతికి చాలాసందేహం.

"మటి మనంచేసేవన్నీ నిజమేకాకపోతే, యీపురోహితుడు యివన్నీ, మనచాత యెందుకు చేయించాలి?....అసలు యీలోకంలో

యెందుకున్నాం? యిదంతా యెట్లావొచ్చింది? వాళ్లుచెపుతారే, అందంతా నిజమేనా?" అంది.

"కొంతన్నా నిజమున్నదనుకుంటా, వాళ్లుచెప్పేదాంటో- మనకంటె జ్ఞానులు, పూర్వులు, యివన్నీ........

"అదిసరేలెద్దూ! మనకేం? అనేకమంది మనకంటే జ్ఞానులు. యివన్నీ తప్పనికూడా అన్నారు- మనకి అర్థమై, మనకి సరిపోవాలిగాని, ఎవరోచెప్పారంటే, మనకేంలాభం? యివన్నీ అర్థంకాంది, యెందుకో తెలీంది, యెందుకు చెయ్యాలి అవి?

"దేవుడున్నాడనన్నా అనిపిస్తుందా నీకు?" అన్నాను యేంచేతగాక.

"యేదోవుంది చాలా అందమయింది, చాలా సంతోషంతో నింపేస్తుంది నన్ను- అంతే నాకుతెలిసింది. దాన్ని దేవుడను యామన్నా అను.... అయితేమాత్రం, వీళ్ల చెయ్యమనేవాటికీ, ఆదేవుడికీ యేంసంబంధం?... అసలు యిట్లా యెట్లా పుట్టామో?

"మన పుణ్య పాపాలకొద్దీ"

"మనం చేసేపనులూ?"

"అవీ అంతే"

"యింక మనప్రయోజకత్వ మేమీలేదన్నమాట! అంతా గీత!"

"అంతేనేమో"

"గీతచేతుల్లో మనము బొమ్మలమా?"

"అంతే అంటారు?"

"అంతకంటె చావరాదూ? బతకడమెందుకు?....మరి నువ్వు యేమేమిటో చేస్తానంటావే యీలోకంలో అంతా గీతేగా! నువ్వు చేసేదేమిటి?"

"నాకేం తెలీదు పద్మా! పోనిద్దూ!"

నేను ముందుజీవితంలో చెయ్యబొయ్యే ఘనకార్యాలని గురించి మాట్లాడేవాళ్ళం. ఆమె మాత్రం ముందు తనేంచేసేది మాట్లాడేదికాదు.

చమత్కారంగా తప్పించేది. ఒకసారి ఆమెకి వుత్తరం, యింగ్లండునించి వొచ్చింది. చదివి చించేసి యోచిస్తో కూచుంది.

"యేమంటాడు?"

"చాలా గొప్ప పరీక్షలు ప్యాసయినాడట, వొస్తాడుట. నువ్వుకూడా గొప్పవాడివి అవుతావుకదూ?"

గడ్డిమీద ఆమె పాదాలదగ్గర కూచుని విన్నాను. నాజుట్టుని వేళ్ళతో సద్ది సరిదిస్తోంది. నేనెంతో గొప్పపనులు చేస్తానని ఆమెనమ్మకం. నేను గొప్ప దేశోద్ధారకుణ్ణి అవుతాననేవాణ్ణి.

"యేదో నలుగురికీ వుపయోగమయింది చేస్తాను. వుద్యోగంచేసి యింకొకరికింద బానిసమాత్రం కాను" అన్నాను.

"అంతేనా నీకు కావలసింది?"

"నిన్ను కలుసుకోకముందు అంతే"

నామెడమీద చెయ్యేసి "యిప్పుడో?" అని నాకళ్ళల్లోకి చూసింది. వారక్తం చిందులు తొక్కింది.

"నువ్వుకావాలి"

ఆమెమొహంలో వుత్సాహమంతా పోయింది.

"యింతే? నేనేమిటి! నేనెంతదాన్ని? నువ్వు లోకమంతా నీకు కావాలని, వుంటుంది. నాకు యెందుకు అనవు?"

నాకు బడాయి హెచ్చింది. మళ్ళీదేశోపకారం కబుర్లు, అతి తీవ్రంగా మొదలుపెట్టాను.

"సరేలే, కాని చాలా నిజమైన, గొప్ప పనులు చెయ్యాలి. అందరికీ ఆదర్శం కావాలి. చేసినపనికాదు; గొప్పతనం, ఔన్నత్యం, శక్తి, యివీ కావలసింది. నేనెక్కడవున్నా సరే, నీపేరు వింటే. హృదయం పొంగి పోవాలి.

యింత గొప్పవాడు, నావాడు కదాఅని, వీళ్ళందరిమల్లే యేదో నలుగురికి, వీధులో పొయ్యేవాళ్ళ పనిచెరిపి, వాళ్ళకి తనకే విశ్వాసంలేని విషయాలు వుపన్యాసాలిచ్చి, ఒకసారి కాన్ఫరెన్సులో, ప్లాటుఫారంమీద

కుర్చీలో తంటాలుపడి యిరికీ, పెద్దబళ్ళవాళ్ళ గుంపుముందు, చేతులు యెగరేస్తో నటిచి; గొప్పవాణ్ణీ, నాయకుణ్ణీ అయినాననుకోకూడదు. వాళ్లని యేవి వుద్రేకిస్తాయో ఆసం... ...యి. ప్రాన్వదేశం, బౌన్నత్యం, యిట్లాంటి యెక్కు అంతాచెప్పి, చప్పట్లు కొట్టించుకోడం గొప్పఅనుకుంటావు. వాళ్ళ వూహలకి లోబడకుండా, నీనిజమైన వుద్దేశాల్లో నిన్ను వాళ్ళు అను సరించేట్టు చెయ్యాలి. నీఆజ్ఞలు పాలించేట్టు చెయ్యాలి''

''నీకోసం యెంత గొప్పపనులన్నా చేస్తాను'' అని ఆమెవైపు చెయ్యిజాచాను. కాని ఆమెదృష్టి యేలోకంలోనో వుంది.

''స్త్రీలు యెందుకనుకున్నావు వుంది! జీవితమంటే ఎంత ఉన్నత మయిందో, గాఢమయిందో, పురుషునికి తెలిసేట్టు చెప్పేందుకు- పురుషుల్ని ప్రోత్సాహించాలి; స్వర్గానికి యెత్తెయ్యాలి, గొప్పపనులకి, గొప్పఆదర్శా లకి, గొప్పవూహలకి, వుత్సాహమివ్వాలి; అగ్నితో నింపెయ్యాలి; నిర్జీవ మైన బతుకులోంచి రక్షించాలి. వాగ్దత్తంచెయ్యి యెన్నడూ యీసామాన్యపు, దేశశేవకులమల్లే, ప్రజలమల్లే, తుక్కుకింద, యేడుపు కింద, శవాకారం కింద, తయారుకానని; వెధవబతుకు, పాడుమొహాలు వేసుకుని కళ్ళమీద పొరలుకమ్మి, కుళ్ళునవ్వులు నవ్వుకుంటో, మర్యాదలో, గౌరవంలో, భయంలో, పిరికితనంలో, ధర్మాచరణంలో, సనాతనధర్మంలో, మత్తులో కొంచెంగా కొవ్వెక్కి, గుండ్రంగాతయారై, పిర్రలు బలసి, అట్లా బతక నని వొట్టెయ్యి''

''ప్రమాణం చేస్తున్నా''

అదీ నాపద్మావతి-నాకు దైవమిచ్చిన పద్మావతి.

.......................................................................................................

మూడు నెలలయింది పద్మావతీ, సత్యవతమ్మగారూ చెన్నపట్టం వెళ్ళారు. పద్మావతిని వొదిలి బతకడం చాలా కష్టమయిపోయింది. యేది చూసినా, ఆమె జ్ఞాపకానికి వొస్తుంది. లోకమంతా అంధకార మయం. జీవనంమీద నల్లని మబ్బు పట్టినట్టయింది.

---

# పద్మావతీ, నేనూ

చివరికి నేను దేశశేవకుణ్ణి, యేవిథంగానా కావడం, అని ఆలోచించి ఆలోచించి, సర్వెంటు ఆఫ్ ఇండియా సొసయిటీలో చేరడం, వుత్తమం అని తలచి, పూనా వెళ్ళాను.

రెండేళ్లు పూనాలో వున్నాను. తరవాత మానాన్నగారికి జబ్బుచేస్తే, పూనానించి యింటికి వొచ్చాను. తోట చూసేటప్పటికల్లా, యిన్నాళ్ళూ మరిచిపోయిన పద్మావతిమీది ప్రేమ, నన్ను కావిలించుకుంది. యేంతోచక పుస్తకం పట్టుకుని, చెట్లకింద తిరుగుతో, పద్మావతి యెక్కడ మొహం యెట్లా పెట్టిందో, అక్కడ ముళ్ళచెట్టుకి చీర పట్టుకున్నప్పుడు, వొంచిన నడుంఅందం యెట్లావుందో; సపోటా చెట్టుకింద నుంచుని యెవరన్నా వున్నారేమోనని, యిటూ అటూ చూసి, నాదగ్గిరగా జరిగి, కళ్ళకొనల్లోంచి యెట్లా నవ్విందో; మోటకాలవలో కాళ్ళుపెట్టి నీళ్ళలోంచి నాకాళ్ళకెట్లా తాకించేదో; జ్ఞాపక మొచ్చినకొద్దీ పిచ్చెత్తినట్లయింది.

ఒకరాత్రి పద్మావతీ వాళ్ళూవచ్చారు. ఆమెని కలుసుకున్నదాకా నేను నిలపలేక పోయినాను. యెట్లా నాకోసం యెదురు చూస్తుందో, నాసంగతి యేమనుకుంటుందో, నేను కనపడగానే నావంక యెట్లా చూస్తుందో, యిప్పుడు యింకా రాలేదేమా అనుకొంటుందేమో! యిద్దరం మళ్ళీ యెంత ఆనందంగా కాలము పుచ్చుతాము! సాయంత్రం ఆమెను చూడడానికి వెడుతో వుంటే, గుండెలు కొట్టుకుంటున్నాయి, కాళ్లు వొణుకుతున్నాయి పద్మావతిని చూడగానే, నాకు కలిగే పట్టరాని సంతోషాన్ని తలుచుకుని, ప్రతిఅడుగూ ఒక మైలులాగు అయింది. సత్యవతమ్మగారు కనిపించి, యెప్పటిమల్లెనే మర్యాదగా, ప్రేమగా పలకరించింది. యింటి నిండా బంధువులున్నారు. అందరూ కొత్తవాళ్ళు. పద్మావతి నేననుకున్నట్టు యెదురురాలేదు. ఆమెను యేనిమిషాన చూద్దామా అని ఆత్రతగావుంది. నాకలల్లో, ఆలోచనల్లో, యెన్నోసార్లు కలుసుకున్నట్లు అయిన, పద్మావతి యింకా కనపడదు. యేదో కలలోనే యింకా వున్నట్టుంది. అందరినీ చూశాను. ఒకరూ నన్ను గుర్తుపట్టరు. పలకరించరు. పద్మావతి యేదీ? ఒకనౌకరు నిలుచునివుంటే, అతన్ని పద్మావతి యెక్కడవుందని అడిగాను.

"లోపల వున్నారండి"

"రాధాకృష్ణగారు వొచ్చారని చెప్పు"

"నేను లోపలికి వెళ్ళడానికి వీల్లేదండి"

యింతలో సుదర్శనం కనపడ్డాడు. నాప్రాణం లేచివొచ్చింది.

"సుదర్శనం, పద్మావతి యేదీ?"

నన్నెగాదిగాచూసి, "మాావదగ్గిర లోపలవున్నదన్నాడు." వెంటనే మొహం తిప్పేసి అక్కడ పంజరంలో చిలకవుంటే, దాని మాటలమీద శ్రద్ధపుట్టినట్టు అటువెళ్ళాను. నామొహం యెట్లావుందో అప్పుడు? కాళ్ళు వొణికాయి. ముచ్చపుటలు పోశాయి. సుదర్శనం భోజనానికి వుండ మన్నాడు. పద్మావతిని చూసే ఆశతో వుంటానన్నాను. భోజనందగ్గిరికి నవ్వుతో, న్యాయమూర్తితో వచ్చింది. చూడడానికి మునపటి పద్మావతే! కాని నన్ను మరిచిపోయిందని తెలుస్తోంది. నాచెవులో రహస్యం చెప్పి మత్తుయెక్కించే పద్మావతి, ఆయింద్రజాలపు పెదిమెలతో ముద్దుపెట్టు కునే పద్మావతి, ఆపట్టుజుట్టు చేలికి తగిలితేచాలు జీవనం ధన్యమవు తుందనేట్టు చేసే దేవకన్య. ఒకచూపుతో, ఒకమాటతో సామాన్యమానవు డికి దేవత్వమిచ్చే అద్భుతశక్తి, నాచెలి, నాజీవనం, నాఆదర్శం, కలేమో అన్నట్టు వొట్టిదయిపోయింది. సుదర్శనం, "రాధవచ్చాడు చూశావా?" అంటే, న్యాయమూర్తి పక్కన కూచుని, అతనుతప్ప యింకెవరూ యీలోకంలో లేనట్టు నవ్వుతో, మాట్లాడుతూ, ఒక నిమిషం కళ్లెత్తిచూసి, చిరునవ్వునవ్వి, మళ్ళీ అతనితో మాట్లాడుతోంది- భోజనమయిం తరవాత యింటికి వొచ్చేశాను. ఆరాత్రి తెల్లవార్లూ నిద్రలేదు- బాధతో; యెందుకు? పద్మావతి తనభర్తతో మాట్లాడిందనా? నాతో మాట్లాడలేదనా? మానాన్న గారు తెల్లారి, "నాయనా, యెందుకోయి అట్లావున్నా"వని అడిగారు. ఎవరితో చెప్పుకోను?

కాలునిలిస్తేనా? మళ్ళీ మర్నాడుసాయింత్రము వెళ్లాను. న్యాయ మూర్తి సుదర్శనంతో టెన్నిస్ ఆడుతున్నాడు. పద్మావతి బల్లమీదకూచుని చూస్తోంది. దూరాన వుండగానే, నన్నుచూసి, లేచి నాకెదురువొచ్చింది.

యింతలో న్యాయమూర్తి మునిగిపోయినట్టు ఆట ఆపి, మమ్మల్ని కలుసుకున్నాడు. న్యాయమూర్తి లావయినాడు, కొంచెం. బట్టతల, పెద్ద సులోచనాలజోడు.

సుదర్శనం నన్నుచూపి నేనెవరో చెప్పాడు. అతను అశ్రద్ధతో తలవూయించి వూరుకున్నాడు. పద్మావతి నాతో మాట్లాడుతోవుంటే అడ్డంవచ్చి "మఱియిందాక.............." అంటున్నాడు. నాతో మాట్లాడుతున్నదల్లా, టానిసలాగు, అతనివేపు తిరిగింది పద్మావతి. "యిందాక టెన్నిసు ఆడతాననలా నాతో?"

"లేదే"

"అప్పుడే మరిచిపోయినావే! పోనీలే." ఆయన మాట్లాడుతోవుంటే ప్రతిమాటా అమృతసోన అయినట్లువుంది పద్మావతికి, ఆయనకి ఆమె మీద చాలాకాపీనంగా కనపడ్డవి. ఆచూపే కోర్కెలో బరువెక్కినట్టు కనుపడుతోంది. నాచూపు యెట్లావుందో అప్పుడు?

భోజనందగ్గిర నాపక్కన ఒకముసలాయన తటస్థపడ్డాడు. నాచెవి కింద ఒకటేమాటలు. న్యాయమూర్తి మీదపడ్డవి ఆయన దృష్టి.

"ఆయనేకదూ న్యాయమూర్తి. అవునా?" తలవూయించాను.

"యేమిటి అన్నాడు యిప్పుడు?"

నే వినలేను.

"ఆడవాళ్ళంటే చాలాయిష్టం ఆయనకి. కనూ?........ చూడు చూడు. ఆచక్కని అమ్మాయివొంక యెట్లా చూస్తున్నాడో? యెవరది?.... పెళ్ళామేనా?" బిగ్గరగా నవ్వాడు.

న్యాయమూర్తి యేదో అన్నాడు. పద్మావతి నావొంకచూసి, తల వూయించింది. "యెంత అందంగావుందో? ఆపిల్లాయనకి! ఆయన సంగతి విన్నావుకదూ?"

"యేమిటి?"

"యింగ్లండులో ఆయనచర్య, అందరికీ తెలుసు. మాబావకొడుకు యింగ్లండునించే వొచ్చాడు"

యేంచేశాడో అక్కడ?

"యేంచేశాడా? యిట్లాంటి పెళ్ళాన్ని యిక్కడ పెట్టుసని. యింతపులుసు వొడ్డించా వేమయ్యా? చారుకదూ నేనడిగింది?"

భోజనం చేస్తున్నంతసేపూ అందరూ నావొంక చూస్తున్నట్టే వుంది. యేంతిన్నానో, తినలేదో తెలీదు. పద్మావతిమీద కోపం మండి పోతోంది. నన్ను వొదిలేసింది నన్ను మరిచిపోయింది? మోసంచేసిందని చాలా వుద్రేకరంగా వుంది. లేకపోతే న్యాయమూర్తితో అట్లా మాట్లాడడం యెందుకు? ఆతనితో అట్లా నవ్వుతోవుందే, నన్ను మరిచి పోయినట్టే అతనితో అంతస్నేహమెందుకు, నాపద్మావతికీ? అతను పలకరిస్తేమాత్రం తనుబదులు చెప్పాలా? పొమ్మని కసిరికొట్టకూడదూ? మధ్య అతనెవరు? పద్మావతిని చూస్తున్నకొద్దీ న్యాయమూర్తిని సంతోషపెట్టాలని ప్రయత్ని స్తున్నట్లు కనపడుతోనేవుంది. ముసలాయిన మళ్ళీయెదో అంటున్నాడు.

"మీకుగూడా అట్లానే తోచిందికదూ?

చూడండి ఆమొహంవంక!" అని న్యాయమూర్తివేపుచూపించాడు.

"చాల బండమొహం" అన్నాను

"అదికాదు ఆమొహంలో చాలా శక్తివుంది, అతనితో తగాదా పెట్టుకుని యెవరు గెలవలేరు. బహుపట్టుదల"

ఆయింటో ఒక్కనిమిషం నిలవడానికి బుద్ధిపెయ్యలేదు. గుండెలో ఆబరువు పెట్టుకుని యింటికి యెట్లావెళ్ళను. వెళ్ళి యేంచెయ్యను. తోట ల్లోకి చీకట్లోకివెళ్ళి నల్లని చెట్లకిందా, పొదలల్లోను తిరిగాను. చివరికి ఒకచోట యెక్కడో ఒకగొయ్యిపక్కన, ఆకుల్లో కూచున్నాను. చలిగాలి వేస్తోంది, ఆకాశం మెరుస్తోంది, కూచున్నాను ఆలోచిస్తో. జీవనంలో యుద్ధం ప్రవేశించింది. నాసౌఖ్యంకోసం, నాజీవనంకోసం, నేను యుద్ధం చెయ్యవలసిన సమయం వొచ్చింది. పద్మావతిని యెన్నికష్టాలుపడి అయినా

సరే సంపాయిస్తాను. పద్మావతిని లాక్కోడానికి, అవసరమైతే, నాజీవిత మంతా యిచ్చేస్తాను. అని దృఢనిశ్చయం చేసుకున్నాను.

తరవాత మూడు నాలుగు రోజులు, ఆతోటలో అడుగుపెట్టడానికి బుద్ధిపుట్టలేదు. యింటిదగ్గరా కాలునిలువదు. తోటచుట్టూ తిరిగాను, పద్మావతి ఒక్కర్తా కనుపడుతుందేమో అని. చివరికి నిలవలేక, అయిదో రోజున వెళ్ళాను. న్యాయమూర్తి వెళ్ళిపోయినాడు. నన్ను చూసి, పద్మావతి అన్నల్ని వొదిలి దగ్గరికి వొచ్చింది.

"పద్మా! యింక మనం యెన్నడూ కలిసి మాట్లాడుకోడం వుండదూ?"

అంతా మారిపోయింది. యిప్పుడు అంతా వేరు

"మునుపు మాట్లాడుకునే వాళ్ళమే, అట్లా మాట్లాడాలని చచ్చిపోతున్నాను"

"నేనో రాధా! నాకెంతగావుంది! కాని.... యెట్లా?.... చూడు మటి సంగతులు యెట్లా వున్నాయో?"

"అన్నీ రాశి పట్టుకువస్తాను"

"అఖర్లేదు, తెల్లారకట్ట అయిదింటికి వొస్తావా?"

రాత్రింతా మేలుకొని........"

"కాని యింతాచేసి ఆఖరికి నేను రావడానికి వీల్లేకపోతే?"

"నాఅదృష్టం"

"మాయింటివెనక మాఅన్నయ్యలయిల్లు జ్ఞాపకంలా.... రోడ్డు వెంబడిరాకు. డొంక చివరనుంచి రా"

సుదర్శనం వాళ్ళూవొచ్చి కలుసుకున్నారు మమ్మన్ని-

"ఈవూరేం బావుండలేదు, తోచడటంలేదు"

"యింటికి వెడదామో, అని ప్రాణాలుతీశావే, చెన్నపట్నంలో" అన్నాడు సుదర్శనం.

"యింకెన్నాళ్ళలే వెడుతున్నావుగా!" అన్నాడు వెంకటరత్నం.

శ్రావణమాసంలో వుదయాలు, యీనాటికి కూడా, పద్మావతినే జ్ఞాపకం తెస్తాయి. చల్లనిగాలీ, కొత్తవానకి పచ్చనైన, భూమి అందమూ, పొంగినట్టు వొత్తుగా మొలిచినగడ్డీ, ఆగడ్డిలో యెర్రని పువ్వులూ, వెలుతురు భారంతో కిందికి వేళ్ళాడే తెల్లని మబ్బులూ, అప్పుడే తెల్లవారిందే అని చుట్టూ చూసుకునే ముప్పాతిక చంద్రుడు అన్నీ కళ్ళకి కట్టినట్టున్నాయి! తడిగాలి వేస్తోవుంటే, చీకటి మసకలోంచి తెల్లగా వుషాదేవిమల్లే నడిచివొచ్చేది పద్మావతి. ఆకాశం మీది సన్ననికాంతి, చిక్కనై రూప మేర్పడి, నావేపు నడిచి వొస్తోందా అన్నట్టు, పూగుతో, తమాషాగా, కదిలేది నాదగ్గిరికి. మేము మాట్లాడుతో వుండగా సూర్యోదయమయ్యేది. నిద్రతో వొంగిన పద్మావతి రెప్పల్లోకీ, రేగినజుట్టులోకీ, చెట్ల కొనలమీదనించి దిగి గడ్డిమీద పాకుతో వొచ్చేది యెండ.

"రాధా, యిన్నాళ్ళకి మళ్ళీ నిన్ను చూశానమ్మా!"

యిద్దరం చేతులు పట్టుకుని నిదానించి అనుమానించి సిగ్గుతో ముద్దుపెట్టుకున్నాము.

"మనవంక ఆజింకపిల్ల యెట్లా చూస్తోందో చూడు" అంది

"నాదగ్గిరికి రావడం నీకు బావుందా"

"నీదగ్గిరికి రావడమంటే నాకు యెప్పుడూ సంతోషమే!"

రాత్రిపడ్డ వానబొట్లకి, తడవకుండా కుచ్చెళ్ళు యెత్తిపట్టుకొని సన్నని గాజులున్నచేత్తో, రాత్రి భూమిమీద తిరికి, పైకి వెళ్ళడం మరిచిపోయిన గంధర్వ కన్యలాగు. అక్కడవున్న చెట్టుదగ్గిరికి నాచెయ్యిపట్టుకుని నడిపించింది. యెగిరి కొమ్మమీద కూచుంది. నేను ఆమె కాళ్ళని ఆనుకుని కింద కూచున్నాను. యెంతోసేపు మాట్లాడుకున్నాము. నామీదే ఆమెకి ప్రేమని, చెప్పించాలని ప్రయత్నించాను. స్పష్టంగా అడగడానికి ధైర్యం చాలదు.

"రాధా, రాధా, యిదివరకు యెన్నడూ నిన్నింత ముద్దుపెట్టుకోవాలనిపించలేదు. యిట్లా దగ్గిరిగా రా"





నవనవలాడే తనముఖాన్ని, ఉదయపు కాంతిలో నూతనమైనముఖాన్ని, నావేపు వొంచింది. ఆమె చేతివేళ్ళు నాజుట్టులో పాకించి నాతలని దగ్గిరగా లాక్కుంది

"నారాజు కదూ నువ్వు!"

"యీరాజుకోసం సాహసించి వొచ్చేసింది. యీరాజకన్య"

"మరి యీరాచకన్యకోసం లోకాలు జయించాలి. పూరికే వొస్తుందా?"

యింక లోకాన్నంతా యేమేంజేస్తానన్నానో జ్ఞాపకంలేదు. నాబుజం చుట్టు చెయ్యేసినూచుని చిరునవ్వుతో నాకళ్ళల్లోకి చూస్తో, వింది వాగుడంతా. యింతతో పొద్దెక్కింది. పద్మావతి వొచ్చినట్లే మాయమయింది.

యింకోరోజు పుదయాన మబ్బువేసింది. సన్ననివాన కురిసి వెలిసింది. కొంచెం చలి, వాసనతో విసిరింది గాలి. లోకమంతా కడిగేసినట్లు కొత్తగావుంది ఆప్రొద్దున్న. న్యాయమూర్తిని తన్నేసి, నాతో వుండిపొమ్మని పద్మావతిని అడగాలని నిశ్చయించుకుని వొచ్చాను. కాని నాకో ర్కెలో నాకే విశ్వాసంలేదు. పద్మావతిని యెట్లాపోషించను? పెళ్ళయినపిల్లని లేవతీసుకుని వొస్తే, యింటి గుమ్మం తొక్కనీరు నాన్నగారు. మూడేళ్ళన్నా పద్మావతి న్యాయమూర్తి దగ్గిరికి వెళ్ళకుండా ఆగితే నేను భాగ్యవంతుణ్ణయి, ఆమెను తీసికెడతానని చెప్పాలి అనుకున్నాను. నాకే పోషించేశక్తివుంటే, పద్మావతి నాదగ్గిరికిరావడం చాలసులభంగా, సహజంగా కనపడ్డది. అనుభవంలేని, యవ్వనోత్సాహంతో నిండిన నాకళ్ళకి. నాదగ్గిరికి రావలంటే పద్మావతికి కలిగే కష్టం, నా ఆలోచనలోకి రానేలేదు. భర్త దగ్గిరికి వెళ్ళబొయ్యేపిల్ల నాదగ్గిరికి వొచ్చెయ్యడం సులభమా? యిన్నాళ్ళూ ప్రేమతో తిరిగితేమాత్రం? నేననుకున్నదివేరు. యెవరేమనుకున్నాసరే, యెన్ని బాధలూ, బీదతనమూ కలిగినాసరే, ప్రేమకోసం, బంధువులనీ. సంఘాన్నీ వొదలడానికి సిద్ధంగా వున్నాను. ప్రేమగల పద్మావతి మాత్రం వొదలడానికి జంకుతుందా? అందరు పిరికివాళ్ళపట్లే, లోకానికి వెరిచి. ప్రేమని పోగొట్టుకుంటారా. మేముకూడా? లోకంలో వాళ్ళమల్లేనే నేను కూడా

అని అనుకొనేవాణ్ణికాదు ఆరోజుల్లో. అందరికన్నా యెట్లానో గొప్ప వాణ్ణనీ, జ్ఞానవంతుణ్ణనీ, ధైర్యస్థుణ్ణనీ నాఅభిప్రాయం. ముఖ్యం పద్మావతి నాకుకావాలి. నామీద ప్రేమగల పద్మావతి యింకోరిదైతే నేనూరు కుంటానా? పద్మావతిని, ప్రేమ నాదాన్నిచేసింది, ఆమె నాస్వంతం, నావాస్తువు, యింకెవరిదాన్నీ కానీను.

లావణ్యమైన ఆమొహంకేసి చూస్తో

"మరి పద్మా! నామీద ప్రేమ లేదూ నీకు?" అని అడిగాను

"నీకు తెలీదు నా ప్రేమంతా నీదేనని"

"మరి ప్రేమవుంటే యిద్దరూ కలిసివుండరూ? ఒకరివారు యింకోరయిపోరూ?"

పద్మావతి నామొహం తేరజూరి చూసింది ఒక నిమిషం.

"రాఘా నేను నాదాన్నే అయివుంటా, ఒకరిదాన్నవడం నాకిష్టంలేదు యెందుకుకావాలి.

"ప్రేమవల్ల"

"నాజీవనం నేనుజీవిస్తా నీవని నువ్వుచూసుకో. ప్రేమవుంటుంది.

"లోకంలో అట్లానామరి?"

"లోకంఖర్మం. మనమెందుకు యిట్లా వుండకూడదూ? ప్రేమ పేరుపెట్టి నన్నెక్కడికో యెత్తుకుపోవాలని చూస్తావెందుకు? అప్పుడుగాని ప్రేమవుండదా?"

న్యాయమూర్తిది కాబోవటంలేదా అని సందేహం కలిగింది గాని, పద్మావతి అతని దగ్గిరికి వెడుతుందని నిశ్చయం తెలీదు. అతని దగ్గిరికి పద్మావతి వెడతానంటే, నాకు అర్థమయ్యేదే. ప్రేమ లేకపోయినా భర్త దగ్గిర సేవచేస్తో పడివుండడం మామూలే. కాని తను స్వేచ్ఛగా వుంటా నని ఆడది అనేటప్పటికే సంఘం కంపమెత్తుతుంది. ప్రస్తుతం నాకు హృదయకంపమొచ్చింది.



"నువ్వు నాతో వుండాలి. నీకు సౌఖ్యంకలుగచెయ్యడం, నిన్ను ప్రేమించడం తప్ప, నాకింక జీవితంలో యేమీ అక్కర్లేదు"

నావొంక నిదానించి చూసింది.

"యెందుకు అక్కర్లేకపోవాలి? నాకోసం నువ్వు అన్నీ యెందుకు వొదులుకోవాలి? నీకు యిదా ప్రేమ చేసే వుపకారం?........ నిన్ను కలుసుకోవడమంటే నాకెంతోయిష్టం. నీదగ్గిర్నుంచి వెళ్ళిపోయి నిన్నుకొంతకాలం చూడకుండా వుండడం మరీయిష్టం. మళ్ళీ మనం కలుసుకొన్నప్పుడు మరీ బావుంటుందిగా! యెవరికీ తెలీకుండా నీదగ్గిరకిట్లా తప్పించుకు రావడంచాలా యిష్టం కాని.... నేనిప్పుడులేనూ, అట్లా నేవుండలేను యెప్పుడూ. నామీద యెవరికీ అధికారం యివ్వను. యెవరి సొమ్మునీ అయిపోను. యెవరి వొస్తువునీకాను. యెప్పుడూ పొద్దున్నా, సాయంత్రమూ ఒకరికికనపడుతూ, రాత్రింతా వాళ్ళతోవుండి, వాళ్ళకి పాతదాన్నయి, అసహ్యం అయిపోను. ఆఖరికి నీకు కూడా.........

ఆగింది.

"మరి నీకు ప్రేమవుంటే...."

"వుంటే? ఆప్రేమగలవాణ్ని నన్నేంచేసినా వూరుకుని, నన్నెట్లా అంటే అట్లా వుపయోగించనిచ్చి, అసహ్యపెట్టి, అక్కర్లేనప్పుడు నామొహం చూడక, మూలపారెయ్యనిచ్చి, కావలసినప్పుడు నామీద దౌర్జన్యం చెయ్యనిచ్చి....అదా ప్రేమ? నేనెన్నడూ వొప్పుకోను. అట్లా నీదాన్ని కావడానికి అసలు వొప్పుకోను, యెన్నడూ. తెలీటంలేదూ? నేను నీకెప్పుడూ నూతనంగా, విచిత్రంగా, అద్భుతంగా కనపడాలి. నిర్మలమైన నీళ్ళలో శుభ్రమై అప్పుడే లేచివొచ్చే నాగకన్యకలాగు వుంటాను. నేను కనపడ్డప్పుడల్లా ఆశతో, ఆనందంతో, నీహృదయం కొట్టుకోవాలి, నాఅందం, నాలావణ్యం, నానిర్మలత్వం చూసి, నువ్వు భ్రమసిపోవాలి, నిన్ను చూసేటప్పటికల్లా నాకు అట్లానే వుండాలి. యెన్నాళ్ళయిన్నాసరే, యెప్పుడూ అట్లానే కొత్తగావుండాలి మనిద్దరికీ. యీవుదయం యెట్లా [illegible] చూడు, జీవితమంతా అట్లావుండాలి. చూడు, యెంతబావుందో!

"అవును నిజమే. కాని లోకంలో అందరూ అట్లా వుంటున్నారా?"

"నేను వుండేది యిట్లాను! నువ్వు లోకం సంగతి యెరగవు. అనుభవం తక్కువ నీకు. యేమిటి! కలిసివుండే యీశవాలన్నిటికీ ప్రేమే? ప్రేమవుంటే వాళ్ళ మొహాలెందుకు యేడుస్తో అట్లా వుంటాయి? ప్రేమ జ్యోతి వెలిగే హృదయంమీద మబ్బుపొర రావడం సాధ్యమా? అనుమానాలు, అధికారాలు, సహాయ్యాలతో బతికేవాళ్ళకి, ప్రేమంటే యేంతెలుసు? మొదట ప్రేమవున్నా- చీకటి గదుల్లోను, వొంటయిళ్ళల్లోనూ, ప్రేమ వూపిరాడక చచ్చిపోతుంది. రాధా నేనెంతమందిని చూశాను.... యేమైనాసరే వీళ్ళమోస్తరు వెధవబతుకు బతకను ప్రేమ పేరుపెట్టి. ప్రేమలేకపోతే పోయింది కాని ప్రేమని చంపుకోలేను. నాచేతులతో"......

---

వారంరోజులయింది. తనుహైదరాబాదు వెళుతున్నానని గులాబి తోటలో రాత్రి పదకొండు గంటలకి తనని తప్పకుండా కలుసుకోమనీ పద్మావతి దగ్గరనించి చీటీవచ్చింది. రాత్రి పదింటికేవెళ్ళి తోటలో కాచు న్నాను. అంతా నిశ్శబ్దం. వెన్నెల సరస్సులమధ్య తేలుతున్నాయి, చెట్ల నీడలు. గులాబివాసన తాగి మత్తెక్కి చెట్లకొమ్మల్లో వూగిసలాడుతోంది గాలి. మంచు పొరవంటి తెల్లని పట్టుచీరమీద నల్లని పూవులు కోటు వేసుకుని మెరుస్తో తణుకులాడుతో, ఆడుతో, సాహసురాలు, పద్మావతి వొచ్చింది.

"యెట్లా వొచ్చాను, చెప్పు! యెట్లా వొచ్చాను నీదగ్గిరికి? నీకోసం రాధా....నీప్రేమనంతా చూపించు. యింకెన్నడూ వీలుండదేమో, అన్నట్లు ప్రేమించు నన్ను- అంతా నన్ను అనుభవించనీ. అందంగా ఉన్నానా? చూడు యీవెన్నెట్లో యెట్లా కనపడుతున్నాను చెప్పు- మాట్లాడు. యిట్లారా"

యేంచెప్పను? అందమా? పచ్చకర్పూరం వాసనేస్తున్న పెదిమల మీది తాంబూలజీరకంటె, తక్కినచోట్లే యెక్కువయెర్రగావున్న కొం...లు

## సాహా, పద్మావతికి.

పద్మావతి హైదరాబాదునించి చెన్నపట్ణం వెడుతున్నానని వ్రాసింది. న్యాయమూర్తితో కాపురంవుండడానికే? వెంటనే చెన్నపట్నం వెళ్ళాను సుదర్శనందగ్గరికి పరిగెత్తాను.

"పద్మావతి వొచ్చిందా?"

"రాలేదు. ఈవాళ మంగళవారమా, వచ్చేసోమవారం వస్తుంది. ఏం!"

"ఏం లేదు కాని న్యాయమూర్తి ఎక్కడున్నాడు?"

"ఇక్కడే. పద్మావతి అందుకనే వొస్తోంది.

"అందుకనా! ఆయనతో కాపరం వుండడానికా?"

"కాక యేమిటి? ఏమిటి అట్లా చూస్తావు?"

"అవును, అవును. అయినా నీకు అందుకేనని నిశ్చయంగా ఎట్లా తెలుసు? అట్లానని రాసిందా?"

"ఎట్లా తెలుసు! ఏమిటీ మతిలేని ప్రశ్నలు? అంతా యేర్పాటయితే ఎట్లా తెలిసేదేమిటి? రాగానే పదిహేనురోజులుండి నంగుంబాకం న్యాయమూర్తి దగ్గిరికే వెడుతుంది"

"పద్మావతి వొప్పుకుందా?"

"ధాఖా, నీకేదో మతి స్థిరంగాలేదు. తరవాతరా. ఏమిటీ. వ్యవహారం చెప్పు. పద్మావతి వొప్పుకుందా! ఎందుకొప్పుకోదూ?

వెంటనే నేను పద్మావతికి నిజమేనా అని ఉత్తరం వ్రాశాను. నిజమేనని జవాబు వొచ్చింది. అంతకన్న యేమీ వ్రాయలేదు. ఆమెకి చాలా దూకుడుతో వుత్తరాలు రాశాను ప్రతిరోజూ. పద్మావతి చెన్నపట్నం వొచ్చింది. కాని మేము వొంటరిగా మాట్లాడుకోటానికి వీలయిందికాదు. ఉత్తరాలు వ్రాస్తోనేఉన్నాను. పద్మావతిని తోడుచేసి ఆడవాళ్ళందరినీ పురాణస్త్రీల దగ్గిర్నించి పుట్టబొయ్యేవాళ్ళదాకా తిట్టాను. వాటికి యేదో జవాబువ్రాసింది, కాని తృప్తికాలేదు నాకు. ఆఖరికి నన్ను తేనాంపేట తోటలో ఉదయం పదింటికి కలుసుకుంటానని వ్రాసింది. సరిగా టైము

కొచ్చింది. అంత అందంగానూ చిరునవ్వుతో హంసలాగు నావేపు నడిచింది. పద్మావతి అందం చూడగానే నాచేతులోంచి జారిపోతోందనే భయంతో ఆమె దీనికంతా కారణమని ఉన్న కోపమంతా బయటికి వొచ్చేసింది. మొదట కోపంగా సాధింపుగా కసురుతో మాట్లాడాను. కాని కర్తవ్యం నాకేమి తెలీదు. వీల్లేదని అనడం దూకుడుచెయ్యడం, బతిమాలడం, తప్ప నాకేమీ చాతకాదు. నాఅహంభావము, నాయీర్ష, స్వలాభము, నాబాధ, నాసంగతే నాదికాని పద్మావతికి యెట్లావుంటుందో, యేమనుకుంటుందో, ఆమె ఇబ్బందులేమిటో, అనే దృష్టిలేదు.' చావలసి నన్నువొదిలేసి, నన్నొదిపించడానికి నావగ్గిర్నించి వెళ్ళిపోయున్నట్టు అనిపించింది. హిందూవాలిక, పెద్ద కుటుంబంది యథావిధిగా పెళ్ళిచేసుకున్న పెనిమిటి పిలుస్తోవుంటే, వెళ్ళకుండా, నిష్కారణంగా, నేను రమ్మన్నానని నాతో వొచ్చెయ్యడం సులభమా! సంఘం, కులం, వంశం, తల్లీ, అన్నలూ, బతకనిస్తారా? నావుద్రేకంలో, బాధలో ప్రేమవుంటే, అవన్నీ వొదులుకోవచ్చు ననుకొన్నా. అట్లావొప్పుకోనందుకు పద్మావతిమీద చాలా అసహ్యం వేసింది. కానీ తరవాత తెలిసింది. పద్మావతి యెంతయోచించి, వెనక్కీ, ముందుకీ సంకోచించి నిశ్చయించుకుందో ఆఖరికి మొత్తంమీద న్యాయమూర్తి దగ్గిరికి వెడితేనే మంచిదని! నాదగ్గిరికి అప్పుడు వచ్చినప్పుడు కూడా ఇంకా సందేహపడుతోనేవుంది ఏంచెయ్యాలా అని. నాతో స్పష్టంగా, నిర్మలంగా, నిష్కపటంగా, మనసువిప్పి మాట్లాడింది. నేనేమి తెలీని మూర్ఖుణ్ణికాని; పద్మావతి అన్నీ ఆలోచించుకునేవుంది; ముందుగానే.

"రాధా, నువ్వంటే నాకు చాలా ప్రేమ స్పష్టంగా కావలసి, మనఃస్ఫూర్తిగా హృదయమంతటితోనూ నిన్ను ప్రేమిస్తున్నాను. చెప్పాలా నీకాసంగితి? నీకు తెలీదూ."

"నాయమూర్తి దగ్గిరికి వెడుతున్నావే మరి:"

"నిన్నెట్లా పెళ్ళిచేసుకోను చెప్పు?"

"ఏం? పెళ్ళే కావాలా యేమిటి? నాతోవుండెయ్యి? అంతమాత్రం సాహసం చెయ్యలేవూ?"



ఆలోచిస్తో కొంచెంసేపు కూచుంది. నేను మళ్ళీ అన్నా.

"ఎందుకు కొట్టాడదట్లా చెప్పు! ఎవరికీ చెప్పకుండా ఉన్నదానవు వున్నట్లు వొచ్చెయ్యి. నిజంగా ప్రేమవున్నవాళ్లు యింకొకరికి పెళ్ళి అయితేమాత్రం, కలిసివుండే వాళ్ళెంతమంది? ఎక్కడకన్నా వెళ్ళి పోదాం, వీళ్ళకి దొరక్కుండా"

"ఎక్కడికి రాధా?" అని మృదువుగా, దీనంగా అడిగింది.

"యెక్కడికన్నానూ!"

పెద్దదై అనుభవం యెంతోకలది, పెంకెపిల్లవాణ్ణి అడిగినట్టు, "అట్లాకాదు యెక్కడికో స్పష్టంగా ఫలానా చోటికని చెప్పు. రేపణ్ణించి యేవిధంగా బతుకుతాము? అది చెప్పు రాధా!" అంది.

"అమాంతం, వున్నవాణ్ణి వున్నట్టుగా యెట్లాచెప్పను?"

"పోనీ చూడు. యెక్కడికో అసహ్యమైన చోటికనుకో. యేసందుల్లోనో, గుడిశల్లోనో బతకాలనుకో. మనకు డబ్బు వుండదు. పొద్దున్నలేస్తే మనయిద్దరికి ఆందోళనమే, విచారమే, తాపత్రయమే.

మన ప్రేమ ననుభవించడానికి సమయమే వుండదు. నేను నీతో వున్నప్పుడల్లా, సంతోషంగా, చింతలేకండా, అందమైనచోట్ల అనుభవించాలని వుంటుంది. తోటల్లో మేడల్లో....

"వుండాం! యేం?"

"అన్నీ కలయి. లాభంలేదు. మనకి డబ్బు వుండనే వుండదు. వున్నా, మంచివీధుల్లోనన్నా మనని అడుగుపెట్టనీరు. సంతోషమైనవాళ్ళూ తెలివిగలవాళ్ళూ, శుభ్రమైనవాళ్ళూ, మనని పలకరించరు. నీప్రేమ సంగతి యెవరికి కావాలి?"

"పోనీలే, వాళ్ళఖర్మం మనకేం? ఒకరి ప్రేమ వొకరికి చాలదూ? యెన్నికష్టాలు వస్తేనేం? మన ప్రేమమాధుర్యంలో, కష్టాలు కనపడతాయా? బా[illegible] పడ్డకొద్దీ, మన అనురాగం వృద్ధిపొందుతుంది. యీలోకానికి జడిసి,

యీనీతివేత్తలందరూ మనతో మాట్లాడ్డం మానేస్తారని, యిన్నాళ్ళనించీ మనం కోరుకొని, కలలు గంటున్న, ఆనందాన్నంతా పాడుచేసుకుందామా? వొట్టిపిరికితనం యింకేంలేదు. కలిసి యిద్దరం వెళ్ళిపోదాము. యెన్నటికీ యింక ఒకరినొకరు విడవక్కర్లేదు. తరవాత చూచుకుందాం, అన్నీ భరిద్దాము, ప్రేమకోసము'' అని గోలపెట్టాను.

''నేనొక మహారాణినైతే, నువ్వు చెప్పినట్లు యీలాగే ప్రజలందరిని లెఖచెయ్యకపోదును. కాని యెవరులేక యిద్దరం, వొంటరిగా యెన్నాళ్ళని సహించగలం? యీనూతనోత్సాహంలో అట్లానే అనిపిస్తుంది. నేనుచాలా మందిని చూశాను రాధా!.........ప్రేమ అనేది ఆకాశంలో దానంతట అది వెలిగే జ్యోతికాదు. కావ్యాల్లో, నాటకాల్లో, ఇంగ్లీషు నావెల్సులో రాసే ప్రేమవేరు; మనుషులం మనకివుండే ప్రేమవేరు. పెళ్ళి అయిందని కథ ముగిస్తారు. తరువాత వాళ్ళప్రేమ యేమయిందో వ్రాస్తే, యెంతఘోరమైన సంగతులు బయటపడతాయో! మనం దాన్ని భద్రంగా పెంచి; కాపాడి, పోషించాలి. లేకపోతే పువ్వులోని మృదుపరిమళంమల్లే యెగిరిపోతుంది? అనురాగం వుంటేసరి, ఒకరినొకరు పూసుకుతిరిగినకొద్దీ యెక్కువవు తుందనుకుంటారు. భ్రమ, యవ్వనకామజనితమైన భ్రమ. నాచాతనువ్వు ముసలిదానిమల్లే మాట్లాడిస్తున్నావు. తప్పదు.........రాధా, నేను నీతో వొచ్చేసి నీభార్యమల్లేవుంటే, యీప్రేమా, ఆనందం, నన్ను చూడగానే కలిగే యీసుందరోద్రేకం నీకళ్ళల్లోమెరుపూ, అన్నీ ఒక్కనెలలో మాయ మవుతాయి. నేను వుండడంవల్ల నీతో, నీకు కష్టాలూ, బాధలూ, చిరాకులూ, కలుగుతాయి. అవన్నీ నేనుపడాలి. నాకు పనిచేతకాదు. నీకు కోపంవస్తుంది నేను మాటలుపడే రకందాన్ని కాదు. నిన్ను చీదరపెడతాను. యేది సరిగ్గా జరక్కపోయినా, నామీదికి వస్తుంది. వుండు విను............నాకు తెలుసు మొగాళ్ళసంగతి. యీబాధలన్నీ నేను పడననికాదు. బాధలుపడితే లాభముండాలి, బాధలవల్ల ప్రేమ యెక్కువవుతుందంటావు. యిల్లాంటి బాధలవల్ల కాదు. నాటకాల్లో కావ్యాల్లోరాసే, ఆబాధలువేరు. నీకు నామీద ప్రేమనశిస్తుంది. యేంలాభం యింతబాధపడి, యిన్నివొదులుకుని? నీకు వంటచెయ్యాలి. కూరమాడుతుంది మాడిందనితెలుసు. యేంచెయ్యను? గొంతువరకు నీకు నామీద చీదరపుట్టి. యేంఅనలేక, అంటే నేనేమం...



అనే భయంతో, కోపం లోపల కుక్కు-ని, పళ్ళుకొరుకుక్కుంటో, అన్నీ విస్తర్లో పారేసి పోతే నాకెట్లా వుంటుంది? యీబాధలవల్ల నేనా ప్రేమ వృద్ధి అయ్యేది?......నీకు పనిచేస్తో పడివుండే దాసీనా, నన్ను నువ్వు తీసికెళ్ళి చేసేది. నీహృదయేశ్వరిని, నీగాంధర్వకన్యని, దాసీదాన్నా చేసుకుంటావు? నీమీద అట్లాకాదు నాకు వుండేది. నీనౌకరిని, బానిసనికావడం నాకిష్టంలేదు. యిప్పుడింత కొత్తగా కనపడుతున్నానా? నన్ను వంటలో, పొగలో, దుమ్ములో, పిల్లలవుచ్చలో, నడుంకట్టుకొని, జుట్టురేగి, పమిట కొంగు జారుతో, కంపుకొట్టుకుంటో, పెద్దపొట్టవేసుకుని—యెన్నడూ—యెన్నడూ——అందుకేగా యీమొగాళ్ళకి యెంత అందంగావున్నా, తమ భార్యలకంటె యితరులమీద మమకారం. అన్ని అవస్తల్లోనూ, రాత్రిళ్ళ పక్కలో, పగలు పెంటలో చూసి, వున్న నూతనత్వం, గౌరవం అన్నీ పోగొట్టుకుంటారు."

"మరి న్యాయమూర్తి దానివి కావటం లేదూ? అతని దాసీ..."

"లేదు. మాయిద్దరికీ మధ్య, కావలసినంతచోటూ, శుభ్రమైనగాలీ, హాయీ, అధికారం, నౌకర్లూ, గదులు, గోడలు, అదిగాక అతనిమీద ప్రేమ నాకు పోతుందని భయంలేదు. అసలు లేదు గనుక...."

"కాని, నువ్వు....అతను నీమీద ప్రేమ మొదలు పెడతాడు—నిన్ను—అతనికి పిల్లల్ని కంటావు."

"ఊహూ, కాదు. అతను వొప్పుకున్నాడు. రాధా, నేను నీదాన్నే నాస్వేచ్ఛ నాది."

"మరి అతనితో కాపరానికి వెడుతున్నావు!"

"అవును, యెందుకంటే, నేనిట్లా వుంటే అతని దగ్గిరికి వెళ్ళకండా, అందరూ యేమంటారు? అతనికీ నాకూ అపకదిస్టే! నన్నుచూస్తే అతనికి అపరిమితమైన యిష్టంట. తనతో నన్ను బళ్ళల్లో తిప్పుకోడం. తను అనుభవించేవీ, సంపాయించేవీ, నాకుయియ్యడం, నన్నూ, నాఅందాన్ని. తన భార్యగా నలుగురికీ చూపడం, అతనికి కులాసా. అంతకంటే యేమక్కర్లేదు అతనికి."

"కాని యేమోలే! లోపల అతనివుద్దేశ్యం యెట్లావుందో! యిప్పుడు కాకపోయినా, యెప్పటికయినా, అని ఆశవుంటుంది. లేకపోతే వొకసారి నువ్వు చేతికి చిక్కేంతరువాత—నువ్వు ఆసలే రావేమోనని భయంతో సరేనని వుంటాడు."

"నాకేం? వాగ్దానంచేశాడు. అతనేమనుకుంటే నాకేం, నాకిష్టం లేకపోయిన తరవాత! నీమోస్తరుకాదు, అతను, నీఅంత భీషణంగా, అంతా నాకేకావాలి మింగేస్తాననడు"

"మనమిద్దరం విడిపోవడంలా?"

"వీల్లేని సంగతుల్లోనే"

"మొత్తానికి చీలిపోవడమేగా?"

"యేమిచీలిపోవడం? ఒకరినొకరు చూసుకుందాం, మాట్లాడు కుందాం, సరేనా?"

"నిన్ను పోగొట్టుకొని—"

"నేను పోసీనుగా నిన్ను?"

"కాని నాకేం సంతుష్టిగా వుంటుంది?"

"కావలసినంత సంతుష్టి నిస్తాగా నేను. యిట్లా గట్టిగా నన్ను వదలకండా పట్టుకొని, వూపిరాడకండా చేసి, యెత్తుకుపోయి, స్వాధీనం చేసుకుంటేనేగాని, ప్రేమ వుండడానికి వీల్లేదూ!"

"మొత్తానికి యెవరోవొకరు నిన్ను నాదగ్గిర్నించి యెత్తుకు పోతున్నారుకదా!"

"నేనాయన దగ్గిరికి వెళ్ళడంవల్ల, నిన్ను తప్పక వొదిలిపోవలసి వస్తుందంటే, నేను వెళ్ళడానికి వొప్పుకునేదాన్ని కాదు.................. నేను నీదగ్గిరికి రావడంవల్ల యేమీ వుపయోగంలేదు, నువ్వు దేశసేవకి వెళ్ళాలి. మనమిద్దరం ఆలోచించుకోలా, నువ్వు చేస్తానని నాకు వాగ్దానం

చెయ్యాలా, ఆపనులన్నీ నువ్వుచెయ్యాలి. అప్పుడు నీకు, నాకు, యీలోకా నికి యెంతనయమో నీకు తెలీటం లేదూ? పెళ్ళాన్నివుంచడం, పోషించ డంలో మాత్రం ప్రవీణుడువి కావడం నాకిష్టంలేదు. అంతేనా నువ్వు చేసేది యీలోకంలో?"

"అయితే నాకోసంఆగు! న్యాయమూర్తి దగ్గిరికి యిప్పుడే వెళ్ళకు. మూడేళ్ళల్లో నేను ధనం, గౌరవం, సంపాయిస్తాను! మన ప్రేమకోసం, మూడేళ్ళేగా!"

"నేను మాత్రం అనుభవించకర్లేదూ? నాకు మేడలూ, నౌకర్లూ, హోదా, గౌరవం, కావాలి. నాకు నువ్వెంత గొప్పవాడివి కావాలనివుందో, నేనూ అంతగొప్పదాన్ని కావాలని నాకూవుంది. నువ్వు నాకోసం గొప్ప వాడివి కాబోతోవుంటే, యేమూలో, దిక్కులేక, పడివుండనా, నేను? అప్పుడు నన్నుచూస్తే నీకెట్టావుంటుంది? నేను గొప్పదాన్ని కావాలి. నీకళ్ళని మెరిపించి, నీమనసు లాగేసి, నీకోర్కెని మండించి; నిన్ను నాపాదాలదగ్గిర ఆరాధింపచేసే మహాసుందరశక్తిని కావాలి నేను. నేను వంటదాన్నయి, దాన్ని పోషించేవాడివి నువ్వయి, యిద్దరం తయారైతే, నీకు వంటదానిమీద యేమిప్రేమవుంటుంది, వంటింటో గోళ్ళుగిల్లుకుంటో కూచునే వొంటదాని మొగుడిమీద నాకేం ప్రేమవుంటుంది? పెళ్ళాంకోసం, పిల్లలకోసం మాత్రం బతకడం, మొగాడికి చాలా నీచం. కుంగిపోతాడు. బానిస అవుతాడు..........నీపేరుపెట్టి మూడేళ్ళు, సన్యాసంపుచ్చుకోవాలా?.... వెధవముండలాగు! భర్తదగ్గిరికి వెళ్ళకండా, యేళ్ళకొద్దీ తనమీద ఆధార పడివుంటే, అమ్మ నన్నెంత గౌరవంగా చూస్తుంది? అసలు తనలో వుండ నియ్యను కూడావుండనీదేమో!"

యిట్లానే మధ్యాన్నం నాలిగింటిదాకా మాట్లాడాము. కాని యేం లాభం లేకపోయింది. రోడ్డుమీదికి వొచ్చాం. యింకా అడుగుతోనేవున్నా.

"మించిపోయిన తరవాత మనమేంచెయ్యలేము. నాకు తెలుసు. నీపెంకెతనంవల్ల మన యిద్దరి జీవితాలూ, పాడుచేస్తావు; ముందే ఆలో చించుకో.........పోని, పద్మా, పూర్వంసంగతులు జ్ఞాపకంరావూ? ఆర.........."

"లపిజ్ఞాపకం చెయ్యడం న్యాయమా, రాధా? నిన్ను వొఫపెట్టి వెళ్ళడం, నాకు సంతోషంగా వుందనుకున్నావా? యిల్లా జ్ఞాపకంచేశావంటే, నేనేమౌతానో తెలీదు"

"మళ్ళీ యెట్లా యెక్కడ కలుసుకుంటామో! మళ్ళీ వొకసారి రా?"

"వెళ్ళింతరవాత అక్కడికి; యీలోపల నిన్నూ, నీహాఫనీ చూస్తో వుంటే వెళ్ళడం కష్టమవుతుంది. చివరకేదో బుద్ధితక్కువ పనిచేస్తాను. నామనసుని, నిశ్చయాన్నీ గంద్రగోళ పెట్టకు."

.........................

యింకా యేదో చెయ్యాలని చెన్నపట్నంలోనే వున్నాను. పద్మావతికి చాలా అసహ్యమైన వుత్తరాయి రాసాను. పద్మావతి నాజీవితానికి జవాబుదారీ అయినట్లూ నన్ను తనవలలో కావలసి వేసుకుని, రెండువిధాలా భ్రష్టుణ్ణి చేసిందనీ, సిగ్గులేనిదనీ, డబ్బుకాశించి నన్ను తోసేసిందనీ. సూచించాను. రెండుసార్లు పద్మావతిని ఆమెయింటో చూడడానికి కూడా ప్రయత్నం చేశాను; కాని వీలయిందికాదు. కోపంలోవున్న మనిషికి, అందులో వొళ్లుతెలీని ప్రేమలో వున్నవాడికి, తనేంచేస్తోందీ తెలుస్తుందా? యెన్నిఅవమానాలయినా లక్ష్యంలేదు. నాకు జీవితంలో ఆశపోయింది. నాకోర్కెలూ, ఆవేశాలూ, అన్నీ నాచుట్టూ, దుమ్ములోపడి మరణవేదనతో తన్నుకుంటున్నాయి.

నాదగ్గిర్నించి, పద్మావతి వెళ్ళిపోయిన విరహబాధకంటె, నాకు కాకుండా పద్మావతి యింకొకరిదయిందనేబాధ అతితీవ్రమయింది. ఆమెని నేను ప్రేమించినది మొదలు ఆమెని నాపదార్థం చేసుకోవాలనే ముఖ్య ప్రయత్నం; పద్మావతి సంతోషంకాదు. ముఖ్యం ఆమెకి బాధ కలిగినాసరే యెవరిదీ కాకుండా ఆమె నాది కావాలి. పద్మావతి ముందు నాదైపోతే, తరవాత నేను ఆమెకి నాజీవనమంతా యిస్తాను; యెంత సేవన్నాచేస్తాను నాదికాకపోతే యేమీలేదు. నాప్రేమఅంతా ద్వేషమైపోతుంది. యిది సాధారణంగా స్త్రీపురుషులకి ఒకరిమీద ఒకరికి వుండేప్రేమ. న్యాయమూర్తి నాపద్మావతి దగ్గిరిగా వొక యింటో ఒకగాలిని పీలుస్తోవున్నాడని నాహృదయం రాత్రింపవళ్ళు దహించుకుపొయ్యేది. దగ్గిరిగా వున్నాడు

కునేవాణ్ణి. దేన్నిపడితే దాన్ని కొట్టాలనిపించేది. యెవరితోనన్నా పోట్లాడా లనిపించేది.

చెన్నపట్నం వదలడానికి బుద్ధివెయ్యదు. పశ్చాత్తాపపడి పద్మావతి వొస్తుందనిన్నీ, యెక్కడో ఆమెని కలుసుకుంటాననీ. యేదో చేస్తాననీ వుండేది. యేంపనిచెయ్యడానికి మతిస్థిమితంలేదు. వూరికే పట్నంవీధులన్నీ తిరిగాను, కాని యెక్కడ తిరుగుతున్నానో, యేంచేస్తున్నానో, నాకు తెలీదు. యెక్కడో ఒక యింటిదగ్గర, మోటార్లూ, సన్నాయీ, పందిళ్లూ వున్నాయి. యింకేమిటి యెవరిదో పెళ్ళి అనుకున్నా. అన్ని నిర్మాణాల్లోకి పైశాచకము యీపెళ్ళి- ఒకరోజు వైనుషాపుముందు నడుస్తున్నా. వైళ్ళి తాగేసి, ఆబాధనంతా మరిచిపోదామనుకున్నాను. కష్టంమీద ఆకోర్కెని అణుచుకుని అవతలికి నడిచాను- యింకోరోజురాత్రి యెక్కడో యెవరో అమ్మాయి నన్ను పలకరించింది. నోటికివచ్చిన మాటలన్నీ అనేశాను.

"నీకెవరిమీదన్నా ప్రేమవుంది, అతను బీదవాడయితే భాగ్యవంతు డయిందాకా కాచుకొనిఆగుతావుకదూ? వొదిలెయ్యవుకదూ?" అనిఅడిగాను. వెళ్ళనంది. ఇట్లామాట్లాడుకుంటూ చీకట్లో తిరిగాము. ఎందుకో కారణం లేకుండానే ఆఅమ్మాయి వ్యభిచార స్త్రీ అని అనుకున్న ఆమెను బాగుచెయ్యా లని నిశ్చయించుకున్నాను. వొక వంతెనకింద చీకట్లో నన్ను ముద్దుపెట్టు కుంది. ఆమెను పెళ్ళిచేసుకోవాలనికూడా తట్టింది నాకు. జేబులోవున్న రూపాయలన్నీ ఆఅమ్మాయి చేతిలోపోసి వెళ్ళిపోయినాను. కొంచెం శాంతి కలిగింది.

ఇంటిదగ్గిర నాకోసం టెలిగ్రాము వచ్చివుంది. నాన్నగారు తక్షణం ఇంటికి రమ్మన్నారు. వెళ్లాను- నన్ను గురించి మానాన్నగారికి యేమన్నా తెలిసిందో యేమో. మధ్యాహ్నం మావూళ్ళో దిగాను. తెల్లారకట్ట నాకు పెళ్లిఅయింది. ఎవరికో ఎట్లాగో నాకు తెలియదు. నేనీలోకంలోలేను. యేమయితేనేం అనుకున్నా. మానాన్నగారిమీద యెంతో దయవచ్చింది- లోకంలో నామీద ప్రేమవున్నది ఆయనకు వొక్కరికిలాగే కనపడ్డది. పెళ్ళొద్దని పట్టుపట్టి ఆయనికి కష్టంగలిగించడం నాకిష్టం లేకపోయింది.

నాకు వొచ్చిన వుత్తరాలు మర్నాడు ఇచ్చారు. గోక్లేగారు తను ఇంగ్లండు వెళుతున్నానని నన్ను తనతో రమ్మని నాకురాశారు. వొస్తున్నానని టెలిగ్రాం ఇచ్చాను. నేను యెక్కడికీ వెళ్ళననీ, తనని మళ్ళీ కలుసు కుంటాననీ, పద్మావతి నాచాత వాగ్దత్తం చేయించుకుంది. కాని ఇంక ఆమెను చూడ్డం దుర్భరం అనుకున్నాను. ఎందుకు చూడాలి? నాకూ పద్మావతికీ ఇంక సంబంధము యేమిటి? ఎంత తొరగా ఆసంగతులన్నీ మరిచిపోతే అంతమంచిది.

---

## శకుంతల.

అయిదేళ్లు ఇంగ్లండులో వుండి ఇండియాకు తిరిగి వొచ్చాను. గోక్లేగారి అధ్యక్షతకింద నేను చేసిన పనులు వార్తాపత్రికలు చదివిన వారందరికీ తెలుసు. చాలాగౌరవం, గొప్ప స్నేహితుల్నీ అన్నీ సంపాయించాను. నాజీవనానికి వుద్దేశ్యం యేర్పడ్డది. ఇంక యేవంకా చూడకుండా దేశోపకారానికే జీవితం వినియోగించడానికి దృఢనిశ్చయం చేసుకొని స్టీమరులోంచి కింద అడుగుపెట్టాను. కీర్తి, మర్యాదా సేవవల్లవచ్చే సంతుష్టి ముందున్నాయి. పాతచరిత్ర ముగిసింది.

చెన్నపట్టణంలో స్నేహితులు వొక మీటింగు యేర్పాటుచేసి ఇంగ్లండులో నాకు కలిగిన అనుభవాలు, దేశసేవను గురించి నావుద్దేశ్యాలు తెలియపరచడానికి లెక్చరు ఇప్పించారు నేను మాట్లాడుతో వుండగా ఆమీటింగు కొచ్చిన ప్రజల్లో, నాకెదురెగా నావొంక చూస్తో, ముందుకు కొంచంగా వొంగి, కూచునివుంది పద్మావతి. మీటింగు అయిపోయింది. అందరూ నాచుట్టూ మూగారు. హాలంతా వెతుకుతూ వున్నాయి నాకళ్ళు. పద్మావతి నా వుపన్యాసం వినడానికి వొచ్చిందంటే ఆలోచించడానికి వ్యవధానం ఇవ్వని వొకటె సంతోషం కలిగింది. ఒకఆయన ఆమె దగ్గిరగా నుంచుని నాసంగతి ఆమెతో చెపుతున్నట్టు కనపడ్డది. నేనెవరో పద్మావతికి! మెల్లిగా పద్మావతివేపు వెళ్ళాను.

"ఇంగ్లండునుంచి వొచ్చారా తిరిగి? మీసంగతంతా మొదటినించీ, ప్రతిదీ, పత్రికల్లో చదువుతోనే వున్నాను. చాలా గొప్పగా పనిచేశారు. దేశానికి మీరంటే చాలా గర్వంగావుంది."

నన్ను మీరంటోంది. నేనేదోఅన్నాను, మామూలుమాటలు. అట్లానే నుంచున్నాము; మాటలురావు; తోచదు, చుట్టూ కొత్తవాళ్ళు వాళ్ళతో కొంచెము మాట్లాడాను. ఇద్దరం బయటికి నడిచాము. పద్మావతి మోటారెక్కింది. నేను పక్కన నుంచున్నా, వంటరిగా వున్నాము.

"ఎందుకు వెళ్ళిపోయినావు. నాతో చెప్పకుండా? నాకు ఉత్తరమన్నా రాశావుకాదు కాదూ?"

"మరేంచెయ్యను?"

మళ్ళీ పద్మావతికి అంత దగ్గిరిగా నుంచున్నాను. నేను ముద్దు పెట్టుకున్న పెదవులు, నేనాడుకున్న జుట్టు, మరచిపోయిందేదో మళ్లీ దొరకినట్లుంది- ఇదివరకటి పద్మావతే ఆ నిష్కపటంగా చూసేకళ్లే. ఆ గర్వంగా పైకి వొంపుతిరిగిన చిన్నగడ్డమే. ఆ దొంగనవ్వుగల పెదిమలే. అయినా మారినట్లుగా కూడావుంది, కొత్త అనుభవం, కొత్త అందం కనబడుతున్నాయి.

"మనం చిన్నప్పుడాడుకొన్నప్పుడు, మాట్లాడుకొన్నప్పుడు ఇంత గొప్పవాడవు అవుతావనుకోలేదు."

"ఇంతకన్నా గొప్పవాణ్ణికమ్మన్నావు కాదూ అప్పుడు! ఇంతకీ యేం గొప్పలే!"

తన ఎడ్రెస్ ఇచ్చి, తన్ని వొచ్చి చూడమంది.

"ఇప్పుడు మునపటిమల్లే రమ్మనడానికి నువ్వు చాలా బిజీమాన్ అయినావు కాదూ? తీరుబడి ఉంటుందో లేదో?" అని చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయింది.

మళ్ళీ అయిదురోజులదాకా వెళ్ళడానికి నాకు తీరుబడి కాలేదు. వెళ్ళి కనుక్కున్నే టప్పటికి న్యాయమూర్తితో కలకత్తా వెళ్ళిందని చెప్పారు- తిరిగివొచ్చి హోటలుముందు కూచున్నాను. బాండుసంగీతం వినపడుతోంది. సాయంత్రపు లేతకాంతి నాకాళ్ళముందు పడుతోంది. ఫేసుపవుడర్లు వేసుకొని కోమటికాంతలు మోటార్లల్లో బీచికి షికారు వెడుతున్నారు. పద్మావతిని కలుసుకుంటానని యెంతో ఆశతో వెళ్ళాను. ఆమె వెళ్ళిపోవడంవల్ల కొంచెం విచారంగావుంది. చిన్నప్పటి సంగతులు జ్ఞాపకం వొచ్చాయి. మళ్లీ మొన్న కలుసుకొన్నప్పుడు, మరిచిపోయిన భాషలో మల్లే యెంత కొత్తగా మాట్లాడుకున్నాము.

పద్మావతి నన్ను మరచిపోలేదు. లేకపోతే, నేను వొచ్చానని తెలీగానే, ఆమీటింగుకి వొచ్చివుంటుందా? యింకా పాతప్రేమ వుందా, అయిదేళ్ల తరవాత, నామీద? నేనెప్పుడో పద్మావతిని మరిచిపోయినాను,

నాపనిలో. కాని మళ్ళీ పద్మావతిని చూడగానే, ఆమెతో మాట్లాడాలనిపించింది. పూర్వం పద్మావతితో, కపటంవిడిచి యేం దాచకండా, స్వేచ్ఛగా మాట్లాడినట్లు, యెవరితోనన్నా మాట్లాడాలని, ఆ అయిదేళ్ళూ నాకు తెలీకండానే కోర్కెపడ్డట్లు నాకు తోచింది. యెన్నోవున్నాయి నాకు ఆమె పక్కన కూచుని, ఆమెకళ్ళల్లోకి చూస్తో, మాట్లాడవలసిన సంగతులు; ఆమెతోతప్ప యింకెవరితోనూ చెప్పలేని సంగతులు. యింకెవరూ అర్థం చేసుకోలేని సంగతులు. మళ్ళీ యెన్నాళ్ళకి వొస్తుందో?..................
నౌకరు నాచేతుల్లో వొక వుత్తరం పెట్టాడు.

"నేను, అమ్మాయి యివాళ్ళ వచ్చాము. సంగతులు మాట్లాడుకోటానికి ఒకసారి రండి. పైనవున్న ఎడ్రసుయింటికి." గోపాలం.

యెవరిది? అమ్మాయి యేమిటి?

మర్నాడు వెళ్ళాను. తలనెరిసిన ముసలాయన నన్ను వసారా గదిలోకి తీసికెళ్ళి కూచోపెట్టి, లోపలికివెళ్ళి, ఒక అమ్మాయిని తీసుకొచ్చాడు. ఆమెకి పదహారేళ్ళువుంటాయి, తెల్లనిచీరె కట్టుకుంది, పొడుగ్గా సన్నగావుంది. చిన్నకోలకళ్ళు. చిన్ననోరు. పొడుగాటి ముక్కు. చామంచాయ శరీరం. నడుముకి బంగారు వడ్డాణం. తలలోనాగరం. ఆమె తల వొంచుకొని ఆయనవెనక నుంచుంది.

"కూచోండమ్మా" అన్నాను.

ఆమె వొళ్ళంతా కంపమెత్తినట్లు వొణికింది.

"యెందుకండీ నన్ను రమ్మన్నారు?"

"యింకేముంది? అమ్మాయి విషయమై మాట్లాడ్డానికి"

"నాతో యెందుకు అమెవిషయం?"

"మీభార్యవిషయమై మీతో గాక యింకెవరితో?"

"భార్య....నాభార్య........?"

నాకు పెళ్ళి అయిందని జ్ఞాపకం వొచ్చింది. యిదివరకు ఆసంగతే మరచిపోయినాను. మరిచిపోయి యింగ్లండులో పెళ్ళి కాలేదనే చెప్పే

వాణ్ణి. యిప్పటివరకు యీఅమ్మాయి సంగతి ఒక్కసారికూడా తలుచుకోనేలేదు. ఆరాత్రి ఆబ్రాహ్మడు యేకరువుపెట్టిన ముక్కలతో యింకో ప్రాణి నాకు శాశ్వతంగా యీలోకానికి ఆలోకానికీ అతికించినీ, యింక వదిలించుకోడం ఆబ్రహ్మదేవుడి తరము కాదనీ మరిచిపోయినాను. యే జిగురుతో, లోహంతో, రక్తంతో, అతికిన సంభంధాలన్నా వొదులుతాయి గాని, ఆపెళ్ళిమంత్రం అతుకు విరగదు, తునగదు, నలగదు, తెగదు. తెల్లమొహం వేశాను.

"అమ్మాయిని శ్రమపెట్టకండి అట్లా కూచోమనండి" అన్నాను.

మెల్లిగా బలవంతంమీద, మోకాలు నాకు కనిపిస్తో, ఆయన వీపు వెనకాల నక్కింది,

"యిప్పుడేం పని మీద వొచ్చారు యీవూరు?"

"పనేమిటి? పని! మీరే మాపని. యెదో మంచిరోజు చూసి...."

"చూసి?"

"మీయిద్దర్నీ వొకటిచేసి...."

"మీరనేది, మేమిద్దరం ఒకరాత్రల్లా గదిలో ఉండాలనా?"

"అదేమిటి అట్లా అంటారు?"

"యెందుకండీ నిర్బంధం?"

"నిర్బంధమేమిటండీ?"

"కాదూ? ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకొంటో, యెవరికీ తెలీకండా, రహస్యంగా, వారు స్వేచ్ఛగా వుండవలసిన విషయాన్ని, సిగ్గు లేకండా వూరంతా ప్రచురించి యిట్లా బలవంతంగా, నిర్బంధించడం అసహ్యంకాదండీ? యిష్టంలేనిది గొడ్లన్నా వొప్పుకుంటాయా అట్లాంటి పనికి? మిమ్మన్నెవరన్నా కొత్తఆమెతో ఖైదుచేస్తే. మీకెట్లా వుంటుంది? యింతవరకు ఆఅమ్మాయి యెట్లాంటిదోనన్నా యెరగను."

ముసలాయనకు కోపం వొచ్చింది.

"యేమిటండీ అట్లాఅంటారు! గుమ్మందాటి యెరగని అమ్మాయిని యేమిటండీ ఆమాటలు? కావలిస్తే మావూరువొచ్చి భోగట్టా చెయ్యండి.

బాగానేవుంది? కంటికి నిద్రలేకండా యెక్కడ యేమాట వొస్తుందో అని...."

"అది కాదండీ నేనన్నది! ఆమెసంగతి యేమీ....కాదండీ ....వుండండి... ఆమెగుణాలు యెట్లాంటివో.... ఆ.... గుణంకాను.... తక్కినవన్నీని....ఆమె మనసూ నామనసూకలుస్తుందో లేదో, అట్లాంటివి. నేనెట్లాంటివాణ్ణో ఆమె యెరగదు."

"పెళ్ళి అయిన తరవాత మనసులు కలవక యేంచేస్తాయి? మాఅమ్మాయి యేంతగాదాల........"

"అయ్యా! మీఅమ్మాయి చాలామంచిది. నేనామెని యేమీ అనటం లేదు. నాకు సరిపడుతుందా లేదా అని ఆలోచించుకుంటున్నాను."

"మరి పెళ్ళిచేసుకోకముందు ఆ ఆలోచన యామయింది?"

"కాదండీ! ఆ అమ్మాయిని నేను యెప్పుడైనా యెరుగుదునా? మీరు చెప్పకుండా మేము కలుసుకుంటే, ఒకర్ని వొకరు గుర్తుపట్టనన్నాలేమే?"

"అవునుమరి. యిన్నాళ్ళు పిల్లని పుట్టింటో వొదిలి..."

పాపం, ఆఅమ్మాయిని కూచోపెట్టి మేమిద్దరం యిట్లా మాట్లాడు కుంటో వుంటే, యామను కొంటుందో? ఆమె మొహం కనబడితేనా?

"యింతకీ యామంటారు?" అన్నాడు

"నేననేదేముంది?"

"వెనక్కి పొమ్మంటారా?"

"మీయిష్టం"

"మరి దీన్ని యిందుకండీ మీరు పెళ్ళాడింది?"

"వినండి. ఒకవేళ నిజంగా మీరు నామామగారే అయితే...?"

"కాకపోతే, యిట్లా, యెదిగిన పిల్లని తీసుకుని మీదగ్గిరికి బిచ్చ మెత్తుకుంటూ, వొస్తామటండీ? యేం? బోగంవాళ్ళమనుకున్నారా? యేమిటామాటలు?"

''పోనీలెండి, అదంతా తెలీక అన్నాను, యింకా నేనేమీ పనిలో ప్రవేశించలేదు. హోటలులో వున్నాను. యీపళంగా, యీఅమ్మాయిని, నామీదపడేసి, మీరు బరువు వొదుల్చుకోవాలనిచూస్తే, నేనేంచేసుకోను? నేను మావూరు, యింటికి వెళ్ళింతరవాత పంపండి. అడ్డంగా యిక్కడికి వొచ్చి గోలచేస్తే యెట్లా?''

"యెన్నాళ్ళకి వొస్తారు యింటికి?''

''అదే యింకా నిశ్చయంలేదు. ముందు కొంత పని వుంది.''

''యెప్పుడో మీరు వొచ్చిందాకా, యెదిగిన యీపిల్లని యింకా నావద్గిర పెట్టుకోనా? అయిదేళ్ళు పెట్టుకున్నాను చాలదూ? యెదిగిన పిల్లని యింటో పెట్టుకోడమంత క్షోభ, నరకం, యింక లోకంలోలేదు. యెప్పుడేమి జరుగుతుందో అని గుండెల్లో బరువు. పగలు శాంతిలేదు. రాత్రి నిద్రలేదు. శత్రువులన్నా వొద్దు ఆబాధ. యేమన్నా కొంచెము వున్నదో, లేనిదో, పొల్లుమాటవిన్నారంటే, మీకేం! అఖర్లేదు పొమ్మంటారు. నేనింక భరించలేను. నాకొద్దు. నాకుతెలీదు. యీదిగులుతో పోతాను. యేమన్నా చేసుకోండి మీభార్యని మీరు. మధ్య నాకెందుకంత యీభారం? రెండువేల రూపాయలుపోసి, పెళ్ళిచేసింది యిట్లా యింటో పెట్టుకోడానికా?"

"మీరు కన్నపిల్లే, మీకింత బరువయిందా?"

"కాకేమిటి? యింకొకరి చేతుల్లో పెట్టింతరువాత"

"బరువు వొదల్చుకోడానికా మీరు పెళ్ళిచేసింది?"

"కాదుమరి?"

"పోనీలెండి, నేను వెడతాను. మనకు ఒకరి సంగతి ఒకరికి అర్థంకాదు"

"చివరికి ప్రాయశ్చిత్తమన్నా...."

"నేను వెడుతున్నాను "

R. Samagal
Rupert a Lion



"అయితే మాఅమ్మాయి అఖర్లేదా మీకు"

"నేనేం అనలేదు."

"ఛీ, ఛీ. యీకిరస్తానీ చదువులూ, వేషాలూ...."

నేను బయిటికి వెడుతూవుంటే ఆఅమ్మాయిని యీమాటలంటూన్నాడాయన.

"నీఖర్మం, యేడు. దరిద్రిపుముండా, యేవెధవ నక్షత్రానో కడుపు చెడపుట్టావు, నాప్రాణాలు తియ్యడానికి!... నామొహం ముందు కనపడకుమళ్ళీ. యామౌతావోఅవు. నాతోమళ్ళీరాకు..."

నేను ఆగి నుంచున్నాను. మళ్ళీ వెనకాలకి వెడదామా అనిపించింది. కాని లాభమేముంటుంధి? యిట్లా యీదేశంలో యెందరు పిల్లలో, యెందరు తండ్రులో!

మర్నాడంతా యీసంగతే ఆలోచిస్తున్నాను. యీదేశంలో ఆడపిల్ల కావడం యెంతటి నీచం! తండ్రీ, భర్తా, చేసిన పాపాలన్నీ, బాధ్యతలన్నీ యీఅమ్మాయి మీద తోసెయ్యడం యెంత సులభం? అపిల్ల భాధ్యత నాదికాదూ? ఆపిల్లయవ్వనం, జీవనం, అంతా నాదికాదూ? యెంత నేను పెళ్ళికావాలని చేసుకోకపోయినా, నన్ను నమ్మారుకాదూ? ఆముసలాయన్ని యేడిపించాలనే వుంది, కాని నాపెంకెతనం మూలంగా, ఆఅమ్మాయికి చీవాట్లూ, తిట్లూ రావడం నాకు బావుండలేదు. యింక ఆమె జీవనం వాళ్ళవూళ్ళో యెంత దుర్భరంగా వుంటుందో?

ఆరోజల్లా బయిటికి పనిమీద వెళ్ళాను. రాత్రి పదింటికి భోజనం చేసి నాగదిలోకి వెళ్ళి, దీపం వెలిగించాను. వరండాలోని కుర్చీ తీసుకు వెళ్ళ బోతూవుంటే, గాజుల చప్పుడు వినపడ్డవి. చూసేటప్పటికి బట్టల దణ్ణెంపక్క గోడకి ఆనుకొని, తెల్లనిచీరె కట్టుకుని, నుంచునివుంది, నాభార్య. నాకు రెండునిమిషాలు నోట మాటరాలేదు. మెల్లిగా దగ్గిరికి వెళ్ళాను!

"అక్కడ నుంచున్నావేవమ్మా! యిట్లా వొచ్చి కూచో" అన్నాను.

కళ్ళంబడి నీళ్ళుకారుతో అట్లానే నుంచుంది.

"పోనీ, చెప్పు, యెందుకు వొచ్చావో; యీరాత్రివేళ "

"నాన్నగారు నన్ను బలవంతంగా యిక్కడికి తీసుకొచ్చి వొదిలేసి వెళ్లారు, నేను రానంటూవుంటే. కోప్పడకండి "

నాకెంతో జాలివేసింది. ఆమె సన్నని నాజూకైన వొళ్ళూ, వొణికే కంఠం, నీటిచుక్కలు రాలేకళ్ళూ, నాహృదయానికద్దుకుని శాంతి, ధైర్యం యివ్వాలి అనిపించింది. శాస్త్రప్రకారం, న్యాయచట్ట ప్రకారం, సంఘం ప్రకారం, మామామగారి ప్రకారం ఆమె నాదేకదా; చంపడం తప్ప, యింక యేం చేసుకోడానికన్నా!

"యిట్లా కూచుంటే సావకాశంగా మాట్లాడుతా. అక్కడ నుంచుని, మొహం చీకట్లోకి తిప్పేస్తే యెట్లామరి!"

చెయ్యిపట్టుకు తీసుకొచ్చి కూచోపెట్టాను. చిన్న గోరింక పిల్ల లాగు నాచేతులో వొణికింది, ఆమెచెయ్యి; ఆమెనడకలో, కళ్ళలో, చిన్ని యెర్రనినోరులో, చాలా అందం కనపడ్డది నాకు. యీబిడ్డకి నేనే దైవం కాదూ? నాదగ్గిర్నించి వెడతాననదు. తనకు స్వేచ్ఛ కావాలనదు; తను వొంటదాన్ని కానని పట్టుపట్టదు, నేనేం ఆమెని బతిమాలఖర్లేదు. ఆమెకి యిష్టం లేకపోయినా నేను దూకుడుచేస్తే చాలు; అకన్న ఆయనతో, ఆదయగల తండ్రితో చెప్పుతే సరి, ఆయనే యీడ్చుకొచ్చి నాదగ్గిర దిగపెడతాడు.

"మీనాన్నగారు చాలా కోప్పడుతున్నారా? యేమంటారు?"

కళ్ళల్లోంచి మళ్ళీనీళ్ళొచ్చాయి. పెదిమలు వొణికాయి.

"చాలా కోపంగా వుందికదూ ఆయనికి? నిన్నిక్కడే వదిలేస్తామంటున్నారా?"

తలఘాయించింది. భుజంమీద చెయ్యివేశాను. తనూలేవబోయింది. లేవకుండా అదిమాను.

"యిట్లా చూడు"

కొంచెంగా తలెత్తింది.

''నేనంటే నీకిష్టమేనా''

ఏం మాట్లాడలేదు.

''మాట్లాడాలి మరి! లేకపోతే నాకు తెలియడమెట్లా? మీనాన్న గారితో యేంచెప్పను?''

మాత్రి పనిచేసింది, తల బాగా వూయించింది.

''నాదగ్గిరే వుండిపోవాలని వుందా?''

''అవును'' మొహంలో సంతోషం కనపడ్డది.

"మళ్ళీచూడు''

కళ్ళు గబగబ లేడికళ్ళవలె కదిలాయి. ఒకసారి చటుక్కున నామొహానికి తగిలి, బల్లవేపు తిరిగేసింది చూపు.

''నాలుగు రోజులు ఆగితే మావూరు వెళ్ళి యేర్పాట్లు చేసుకుని, నిన్ను రమ్మని రాస్తాను''

మొహం వాలింది.

''అఖర్లేదు అన్ని యేర్పాట్లూ నేనే చేస్తాను. నాకు వంటపనీ అన్నీ చాతవును. మీదగ్గిర వుణ్ణిస్తేచాలు.''

ఒక్కసారి కావలించుకుని సరేననాలని బుద్దేసింది. కాని కొత్త.

"భయపడకు. తప్పకుండా రెండు నెల్లల్లో తీసుకెడతాను. ఇప్పుడు నాదగ్గిర డబ్బుకూడ లేదు''

"మీతో ఎక్కడికంటె అక్కడికొస్తా. మీకేం కష్టమివ్వను. డబ్బు లేకపోతేనేం? నాకు నగలూ, నవుకర్లూ అఖ్ఖర్లేదు. మళ్లీ మానాన్న గారి దగ్గిరికి పంపకండి. అంతేచాలు."

నాకు నవ్వాలో, జాలిపడాలో తెలీలేదు. నా పౌరుషమంతా ఆమెదయి పోయింది. తలమీద చెయ్యేసి దువ్వాను.

"ఇట్లాచూడమ్మా! నీ పేరేమిటి?"

"శకుంతల"

"ఇట్లా చూడు, శకుంతలా."

తనపేరు నానోటినుండి విని, అదిరిపడింది.

"నామాటలు వినవూ? నిజంగా ఇప్పుడు నాతో వుండడానికి వీల్లేదు. వీలుంటే నిన్ను వెళ్ళమంటానా?"

"సరే మీయిష్టం, మిమ్మన్ని నమ్మాను."

ఇద్దరం బయలుదేరి మా మామగారున్న యింటికి వెళ్లాము. రెండు నెలలదాకా శకుంతలని తనతో వుంచుకుంటానని ఆయన్ని వొప్పించే టప్పటికి, రాత్రి పన్నెండు గంటలయింది.



# మళ్ళీ మొదలు.

చెన్నపట్టణం రాగానే పద్మావతి నాకు వుత్తరం రాసింది. నేను చూడ్డానికి వెళ్ళాను. న్యాయమూర్తి పెద్దమేడలో సగం పద్మావలిది. పువ్వులతోట యెదురుగుండా వున్న పెద్దగదిలో కూచునివుంది ఆమె. అమె సోఫా దగ్గిరగా కుర్చీలాక్కుని కూచు న్నాను. కొంచెంసేపు తోటవేపు చూస్తో కూచుంది ఆలోచనగా, అంత అల్లరిపిల్లా అనుభవం సంపాదించిన స్త్రీ అయింది, యిప్పుడు. అనేక మందిని చూసి వాళ్ళతో మాట్లాడి లోకమంటే యేమిటో తెలుసుకొని వుంటుంది, యీఅయిదేళ్ళలో.

"మళ్ళీ నాజీవితంలోకి వొచ్చావా?" అంది తటాలున.

తలయెత్తి చూశాను. ఆమెకళ్ళల్లో నీళ్లున్నాయి.

"మనజీవితంలో అయిదేళ్ళు గడిచిపోయినాయి." అంది.

మళ్ళీ యెంతో దిగులు కలిగింది నాకు.

"యింక మళ్ళీ యింగ్లండు వెళ్ళవుకదూ?"

"అఖర్లేదు. యిక్కడే పని ప్రారంభించాలని అనుకుంటున్నాను?"

"పాలిటిక్సే?"

"అవును."

కొంచెంసేపు వూరుకుంది.

"నువ్వు అట్లా వెళ్ళిపోతావనుకోలేదు నన్ను వొదిలి. వుత్తర మన్నా రాశావా? నావుత్తరాలకి జవాబు రాశావా పోనీ?"

"నాకు పిచ్చెత్తింది.... అంతా మరచిపోవాలని నిశ్చయించుకున్నా"

"మరచిపోగలిగావా?"

"ప్రయిత్నించాను"

"యిప్పుడో....?"

"అంతా కళ్ళకి కట్టినట్టుంది. ప్రతికొంచెమూ"

"నేను ప్రయత్నించాను, నిన్ను మరచిపోయినానే అనుకున్నా. యెన్నిసార్లో ఆశడ్డాను. మునుపు నీతో మాట్లాడినట్లు, నిన్ను కూచోపెట్టుకుని, మాట్లాడాలని. అంతా, జరిగిందంతా, లెఖచెయ్యకండా వెళ్ళిపోయావు కదూ, నీకేం అఖర్లేనట్లు! మొగవాడికి ఆడది యెందుకు కావాలో యిప్పుడు తెలుస్తోంది."

"కాని నువ్వు చేసిందంతా జ్ఞాపకంలేదూ?"

"అవును. అన్యాయం చేశాను నిన్ను. నిన్నుపాపం, చాలా అన్యాయం చేశాను" అని నెమ్మదిగా అంది.

నేను లేదన్నాను,

"నిన్ను చాలా బాధ పెట్టాను. నాకు తెలుసు. కాని నువ్వు నన్ను వొదలలేక నాదగ్గిరే వుంటావనుకున్నా. మొగవాడు అలాంటి విషయాల్లో వోపిక పట్టలేడని తెలీలేదు, ప్రేమ వుందికదా, మనస్నేహానికి భంగం రాదనుకున్నా"

"కుర్రవాణ్ణికదూ? నాకు అప్పుడేంతెలుసు?"

"యిప్పుడు?"

"యిప్పుడు మనమిద్దరం స్నేహితులంగా వుండకూడదూ? తక్కిన సంగతులను పోనిచ్చి?

యిద్దరం సీరియస్‌గా ఒకరిని వొకరం చూసుకున్నాము. గడచిన సంగతుల హోరు కొంచెంగా వినపడుతోంది. పద్మావతి ఆలోచిస్తో, పరధ్యానంగా

"అవును స్నేహంగా వుండొచ్చు"అంది. మళ్ళీ కొంచెంసేపుండి,

"యిన్నాళ్ళూ రాధా, నువ్వు యెప్పుడూ నాకళ్ళల్లో మసలుతోనే వున్నావు" అంది.

మళ్ళీ కొంచెంసేపుండి

"యిద్దరం సెటిల్ అయినాము, లైఫ్‌లో. నీకు పెళ్లిఅయిందామటి! యింకేం! యింక భయం లేకండా. యిష్టమొచ్చినట్లు మాట్లాడుకోవచ్చు. నీఆదర్శాలూ అన్నీ, అభిప్రాయాలూ అన్నీ, చెప్పు. నువ్వు లేకండా బతుకు యెంతో అర్ధహీనంగా వుండేది. యేంచెయ్యబోతున్నావు? కౌన్సిలుకు స్టాన్డు, అవుతావా?" పద్మావతితో యీతుక్కు-సంగతులన్నీ మాట్లాడాలని పించలేదు. యేమేమిటో మాట్లాడి, యింటికివొచ్చాను. పద్మావతి తప్ప మనసులో ఆలోచనేలేదు. ఆమెకళ్లల్లో మాధుర్యం, ఆమెకంఠంలో మృదుత్వమూ 'రాధా' అన్నప్పటి అనురాగమూనూ, పద్మావతిని చూడ్డంతోనే శకుంతల మీది ప్రేమ, యెండలో వెన్నెలవలె మాయమయింది, పద్మావతి సహాయం తీసుకుంటో ఆమె కిష్టమయ్యేట్టు, ఆమెకి నన్ను చూస్తే గర్వం కలిగేట్టు, నేను గొప్పవాణ్ణి కావాలి. ఆమె ఆంతరంగిక మిత్రుణ్ణి అవుతాను. యిట్లా అనుకున్నానుగాని, నా అంతరాళం లోపలినించి నాకు కావలసింది, పద్మావతే; ఆమె స్నేహం కాదు; అనే ధ్వని వినపడుతోంది. స్నేహమే కావలసింది; యింకేమి అఖర్లేదు అని సమాధాన పరచుకున్నాను. నా ఆదర్శాలన్నీ ఆమె జీవితంలో ప్రవేశపెడతాను; ఆమె సౌందర్యంతో నాజీవితం వెలిగించుకుంటాను; అంతే; అంతకన్నా యేమీలేదు. యెంత సులభం, యెంత సరళం, యెంత నిర్మలం, యెంత సుందరం.

మర్నాటినించి పద్మావతి మయమయింది నా ప్రపంచమంతా. ప్రతిరోజూ వెళ్లి పగలూ, సాయంత్రం, రాత్రిలో కొంత భాగం అక్కడే గడిపేవాణ్ణి. మా స్వాధీనములోని మహాప్రేమ జలధి పొంగుతోందీ, మమ్మన్నిద్దరినీ దగ్గరకుతోస్తో. మొదట స్నేహితులమల్లే మాట్లాడుకొన్నాము. కొద్దికాలంలో పొంటరిగా యిద్దరం కలుసుకుంటున్నాము. పద్మావతికి శకుంతలమీదా, నాకు న్యాయమూర్తిమీదా, జలసీ; యేమికారణం లేకుండానే. మేమిద్దరం తగలకుండా దూరంగా కూచోడమే కష్టంగా వుండేది. యెంతో ప్రయత్నం మీద కష్టపడి, నౌకర్లని దగ్గరవుంచుకుని గడిపాము రోజులు. ఒకరి వుద్రేకం సంగతి యింకొకరికి తెలుసు. యిద్దరం చేసే ప్రయత్నాలు యిద్దరికీ తెలుసు. ప్రేమకి యిట్లాంటి విఘాతం కలిగిస్తున్నందుకు సంఘంమీద దుమారంలేస్తోంది. పెద్ద తిరగబాటు, యెదిరింపు సాహసం.

ఒకరోజు సాయంత్రం తోటలో కూచున్నాం. న్యాయమూర్తి నాతో టెన్నీసు ఆడి, వోడి, క్లబ్బుకు వెళ్ళాడు. పక్కబల్లమీద 'టీ, పెట్టి వుంది. యెవరం తాగలేదు. పేముకుర్చీల్లో కూచుని తోటవొంకా, దాని వెనకాల పచ్చగావున్న పడమటి ఆకాశంవంకా చూస్తున్నాము. పద్మావతి 'బట్లర్ని' అక్కడే వుండమంది. వాడు యిబ్బందిగా వెనక నుంచున్నాడు. ఆతోటకి దిష్టిబొమ్మలాగున వాడి తెల్లబట్టలూ, తలగుడ్డా. సగం పచ్చనైన చిన్న మబ్బు తూర్పున పనివున్నట్టు పరుగెత్తుతోంది. అందాకా వూరికే వున్న తెల్లని మబ్బొకటి దాన్నిపట్టుకోడానికి వెనకాల బయలుదేరింది. మొదటి మబ్బుని అందుకుంటో తనుకూడా పచ్చనయింది. చెయిజావీ ఆమబ్బును కావలించుకొని, దాంతో వొకటి అయిపోతోంది. నేనుపక్కకు వొంగి పద్మావతి బుజం మీద చెయ్యేసి ఆమబ్బులవంక చూడమన్నాను. పద్మావతి పక్కకి జరిగింది. నా దగ్గర్నించి యిట్లా తప్పించుకుంటు న్నందుకు ఆమె మీద కోపం యెక్కువైపోతోంది. తప్పించుకునేదాన్ని పట్టుకునే వేట స్వభావం నాలో ప్రబలుతోంది. అతిప్రయత్నం మీద నన్ను నేను అణచిపెట్టుకుని, తలతిప్పేసి కూచున్నాను, మాయిద్దర్నీ చూసినవాళ్లు అప్పుడే తీవ్రంగా పోట్లాడి, జన్మవిరోధం వొచ్చిన వాళ్ళనుకుంటారు. మా ముందు సన్నని చంద్రుడు కనపడ్డాడు. పద్మావతి మొహాన్ని చీకటి దాచేస్తోంది. యెన్నాళ్ళని నా దగ్గిర్నించి యిట్లా చీకట్లో మాయమవుతో వుంటుంది? కోపం నాకు యెక్కువయింది. సాహసం కలుగుతోంది.

ఆ బట్లర్ని గిన్నెలు తీసుకొని పొమ్మన్నాను, వొద్దనేటట్టు పద్మావతి తలతిప్పింది. కాని నా మాటల వుద్రేకం గ్రహించి, వూరుకుంది. అతను వెళ్ళగానే మెడచుట్టూ చేతులేసి వొంచి ఆమె కళ్ళల్లోకి చూశాను. నావొంక నిదానంగా, చూస్తోంది. చిన్నగాలి అమె చంపలమీది జూలు కదిలించింది. వొంగిన ఆమె తెల్లని మెడ అందం నాకళ్ళని కట్టేసుకుంది. మెల్లిగా నా తలని వొంచి ఆమె బ్లౌజుకాలరు మధ్య మెడకింద ముద్దుపెట్టుకున్నాను, మెల్లిగా నా చేతులు తీసేసి, లేచి, యింటివేపు వెళ్ళిపోయింది. ఆ మెడని తాకిన మాధుర్యం నా పెదిమ ల్నివొదలలేదు. రాత్రిపడ్డా బంగారు కాంతిని పడమటిదిశ వొదలనట్లే. రక్తంలో పద్మావతి మోహం షైనులాగు ప్రవేశించింది. యింకా శాంతి లేదు. లోకంతెలీని వొక్కణ్ణీ ఆ చక్కని

రాత్రి యేంచెయ్యను? యెట్లా మళ్ళీ యీ సౌందర్యం లోంచి, నిర్జీవమైన ఆ పట్టణం వీధుల్లో, కాలుపెట్టను? పద్మావతే నా జీవం, పద్మావతే నా మాధుర్యం పద్మావతే నా ఆదర్శం. గానుగచెట్టు కొమ్మల్లో మిణుగురు పురుగులు గుత్తులుగా వేళ్ళాడుతున్నాయి. నక్షత్రాలు గాలిలో వూగుతున్నాయి. మెల్లిగా నడుస్తో పద్మావతి కోసం వెళ్ళాను. ముందుగదిలో లేదు. దీపాలు వెలిగించలా. యింటోకి రాలేదేమో! స్విచ్చిలాగాను. దీపంవెలిగింది. యెవరూ లేరు. మళ్ళీఆర్పి, కుర్చీలో కూచున్నాను. చాలాసేపయింది. నాకు పద్మావతి కావాలి. యెదీ? లేచాను, చీకట్లో కుర్చీలూ, బల్లా, చచ్చిపోయిన స్నేహితుల వలె కనపడ్డాయి. వాటికికూడా ఆత్మా, జ్ఞానమూ వుంటాయి అని తట్టింది. బల్ల దగ్గిరికి వెళ్ళి పద్మావతి కూచునే కుర్చీవీపుని భక్తితో కళ్ళ నద్దుకొని, ముద్దు పెట్టుకున్నాను. బల్ల వెనకాల లోపలి గదితలుపు తెరిచి వుంది. దాని వెనకాల కిటికీలోంచి మళ్ళీ చంద్రుడు కనపడుతున్నాడు. చంద్రుణ్ణి చూడగానే పద్మావతి కంఠంరుచి పెదిమలకి తట్టింది. యేది అడ్డమున్నా నలిపేసి, పరిగెత్తే పద్మావతిని పట్టుకుని, ఆ మాధుర్యానంతా తినే ఆవేశం కలిగింది. నలిపెయ్యాలి, నాదాన్నిచేసుకుని, యేం మిగలకండాచెయ్యాలి. గుప్పెట్లు బిగుసుకున్నాయి. పళ్ళు కరుచుకుపోయినాయి. దేన్నీ లక్ష్యంచెయ్యని సాహసంతో మనసు నిశ్చలమయింది. జీవితం, వూపిరి, దృష్టి, ఆలోచన పద్మావతి సౌందర్యం మాయమయినాయి. యేది చూసినా పద్మావతే. కిటికీ పక్కన వున్న విరజాజి, వాసనతో గదిని నింపేసింది. పక్కగదిలోకి వెళ్ళాను. యెప్పుడూ ఆ గదిని చూడలేదు, నేను. దీపంస్విచ్చికోసం తడిమాను, యెక్కడవుందో కనపడలేదు—

"పద్మా!"

పలకలేదు. కాని యెక్కడోవుందని తెలుసు నాజ్ఞానచక్షువుకి. వెతుకుతో నాలుగడుగులు నడిచాను. మంచం కాళ్ళకి తగిలి, ముందుకు వొరిగాను. నారెండుచేతులూ పద్మావతి వంటి మీద పడ్డాయి.

"పద్మా!"

చేతుల్లో చంపలు పట్టుకుని మొహం దగ్గిరికి వొంగాను.

మెరిసే ఆ కళ్ళని నావంక పెద్దగా, విప్పి చూస్తోంది. వాటిని ముద్దు పెట్టుకుని మూశాను. కన్నీళ్ళు వెచ్చగా తగిలాయి.

''యెందుకు? యెందుకు?''

రెండుచేతులతో నన్ను లాక్కుని నాతలని వూపిరాడకండా, ప్రచండ వాయుఘాతంతో లేచిపడే, సముద్రమువలె వూగిపొయ్యే, ఆవక్షానికి, అదుముకుంది.

"రాధా"

---

# భేదం.

యీ మహా ప్రేమ మారుతంలో యెన్నాళ్ళు తేలి ఆడానో, వొళ్ళు మైమరిచి, తెలీదు. కొన్ని రోజులు నిమిషాల మల్లే మాయిమైనాయి, కొన్ని నిమిషాలు, యుగాల మల్లే, సాగాయి.

మొదటినుంచి పద్మావతికీ నాకూ, యీ అభిప్రాయ భేదం వుంది. మా ప్రేమ రహస్యంగా దొంగతనంగా, వుంచడానికి మేమేమీ ప్రయత్నాలు చెయ్యకూడదని నా వుద్దేశ్యం. యెవరికన్నా తెలుస్తుందేమోనని భయం వుండకూడదూ: కళ్ళున్నవాళ్ళని చూడనియ్యాలి న్యాయమూర్తికీ, తన అన్నలకీ తెలిస్తే, మమ్మల్ని విడతీస్తారని పద్మావతి భయం, తన పొజిషన్, స్వేచ్ఛా, సౌఖ్యమూ, గౌరవమూ, యేవీ వొదలడానికి ఆమె కిష్టంలేదు. అందుకని రహస్యంగా వుండాలని అంటుంది, మా ప్రణయ సఖ్యం.

అంతటి కోపానికి కారణమున్నా, న్యాయమూర్తిని చూస్తే నాకు యిష్టమూనూ, గౌరవమూనూ! ఆ వెడల్పాటి మొహం, పొడుగాటి ముక్కు, పెద్ద నోరూ, చిన్న చుక్కలవంటి పరధ్యానంగా వుండే కళ్ళూ, తలుపుకుండే జారేస్తుంది, యెప్పుడూ తన యింజనీరింగు గొడవే, నాకీ ప్రేమలాగు. అందరితో మల్లే నాతోనూ స్నేహంగా వుండేవాడు. యింటో యెవరు వుండేదీ, వెళ్ళేదీ, అతనికి యేమీ పట్టదు. అప్పుడప్పుడు నావేపు అనుమానంగా చూస్తున్నాడా అనిపించేది. పగలూ రాత్రి ప్రొద్దు పొద్యే పనులూ, వాళ్ళింటోనే వుంటో వుండే; పద్మావతి భాగంలోకి అతను వచ్చినప్పుడల్లా నేను అక్కడే వుంటే, అతను యేమనుకుంటున్నాడో, అని భయం వేసేది. కాని చాలా సార్లు నా పక్కనుంచి నడిచి కూడా, నన్ను చూసేవాడే కాదు. అతని ముందే పద్మావతి నా మీద దయచూపించేది. అతన్ని మోసం చేస్తున్నానని బాధ కలిగేది, కాని చాలా సమాధానాలు చెప్పుకుని ఆ బాధని అణిచేసుకున్నాను. స్త్రీ పురుషుడి సొమ్మా! ఒక మనిషి యింకొక మనిషి ఆస్తి యెట్లా అవుతుంది? అనాగరికులవీ, మూర్ఖుల దీనీ, ఆ అభిప్రాయం! పిరికివాళ్ళూ, అర్థంలేని పూర్వాచారాన్ని పట్టుకు వేళ్ళాడే వాళ్లూ కావడంచేత, యీ పల్లెల్లో యింకా స్త్రీలు పురుషుల

ఆస్థితో జమ కట్టబడుతున్నారు. అయినా అసలు పద్మావతి నాదే కదూ? కాని పద్మావతి ఉనదని న్యాయమూర్తి అనుకుంటున్నాడే! పద్మావతి కూడా తను అతని ఆస్తే అనుకుంటున్నట్టే వుందే! నేనూ అట్టానే ప్రవర్తిస్తున్నానుగా! లేకపోతే, యీ దొంగతన మెందుకు? పద్మావతి అతని యింటో వుండడం, అతని తిండి తినడం, మా యిద్దరికీ యేమీ సంబంధం లేదని అతనికి కనపడేట్టు ప్రవర్తించడం, యెందుకు?

అప్పుడప్పుడు నాభార్య జ్ఞాపకం వొచ్చేది. తెల్లగా, సన్నగా, కోమలంగా, నావొంక ఆ కోలకళ్ళతో దీనంగా చూస్తో, నా నోట్లోంచి యేం మాట వొస్తుందో అని ఆతృతగా కాచుకుని వున్నట్లు కనపడేది. కాని వెంటనే మరుపుకు తెచ్చుకునేవాణ్ణి. యింతలో వొక రోజు హఠాత్తుగా మా మామగారు వొచ్చి, నా గదిలో కనపడ్డారు. రాత్రియింది, నేను పద్మావతి దగ్గిరికి వెళ్ళబోతున్నాను,

"మూడు రోజుల నించి తిరుగుతున్నానండి మీకోసం; చాలా మర్యాదగా వుందండి! యిదేనండీ రెండు నెలల్లో అమ్మాయిని తీసికెల్లడం? రెండు నెలలా, రెండేళ్లా........"

"యిప్పుడు వీల్లేదండి."

"నేనూ మా అమ్మాయి రాసిన.........."

"అన్నీ అందాయి, తీరుబడిలేదు. జవాబు రాద్దామనుకున్నాను గాని, పని తొందరలో........"

"యేమిటండి అంత తొందర పని? నెలల తరబడి......"

"నా పని సంగతి మీ కెందుకండి? మీ పని మీరు చూసుకోండి చాలు. యేమైతేనేం, యిప్పుడు వీల్లేదు"

"వీల్లెదూ? యింకెప్పుడు వీలవుతుంది?"

"తెలీదు."

"చెప్పండి. అసలు తీసుకు వెళ్లరా యేమిటి."

"తెలీదు"

"మీకు కాకపోతే యెవరికి తెలుస్తుంది?"

"ఆ అమ్మాయి ఖర్చు కింద నెలకి యాభై రూపాయలు యిస్తాను, నేను తీసుకు వెళ్లడానికి వీలయిందాకా. నన్ను వేధించకండి."

"బాగానే వుంది! రూపాయ లెవరికి కావాలి? దాన్ని నేనేం చేసుకోను?"

"యేం చేసు కుందామని కన్నారు?"

"పెళ్లిచేసి సజావైన పెనిమిటి దగ్గిరికి పంపుదామని."

"అయితే పెనిమిటి, పంపమన్నదాకా ఆగండి."

"యెన్నాళ్లు? ఒక యేడా, రెండేళ్లా!"

"యెన్నాళ్లయినాను! నాకు టయిమయింది వెడుతున్నాను."

"మీకేం మతిపోయిందా? మాఅమ్మాయి కూడా గంపెడు ఆశతో వొచ్చింది. యింటికి వెళ్లి యామెని చెప్పను? యేం కారణం వల్ల మీరు తీసికెళ్లరండీ? కుంటిదా, గుడ్డిదా?"

నేను వెళ్లిపోయినాను వినిపించుకోకండా. పద్మావతితో నవ్వుతో మా మామగారి సంగతి చెప్పాను. పద్మావతి మాటలు నాకు ఆశ్చర్యం వేశాయి. వెంటనే మా మామగారిని క్షమాపణ వేడుకుని సమాధాన పరిచి, యిల్లు అద్దెకు తీసుకున్న, శకుంతలతో కాపరం పెట్టమంది.

"మరి నేనెప్పుడూ యిక్కడే వుంటే, ఆ అమ్మాయికి యెట్లా వుంటుంది?"

"యెట్లాగన్నా వుండనీ. అక్కడా 'యిక్కడా సమానంగా వుంటో వుండు. లేకపోతే యిప్పుడు మీ మామగారు గోలచేస్తాడు. అందరూ నువ్వు నీ భార్యతో యెందుకు కాపరం వుండలా అని ఆలోచించి, నీకు యిల్లాంటి సంబంధం యెదోవుందని వెతకడం మొదలు పెట్టారంటే, అందరి కళ్ళూ మనవేపు తిరుగుతాయి."

విధిలేక, పోయి, మామగారితో మాట్లాడి, ఆ అమ్మాయిని వాళ్ల బంధువుల యింటో వుంచే యేర్పాటు చేశాను. ఆమెను రోజూ చూస్తో

వుంటానన్నాను. కొన్నాళ్ళు ఆమె దగ్గిరికి ప్రతి సాయంత్రం వెళ్ళేవాణ్ణి. తరవాత తీరిక లేక మానేశాను.

..........................................................................................

..........................................................................................

పద్మావతితో యీ రహస్య జీవనం రోజు రోజూ దుర్భరమై పోతోంది. కాని ఆమెతో చెప్పలేను. అంత మాధుర్యమూ, ప్రేమా, సౌందర్యమూ, యిస్తోవుంటే, తృప్తి లేదని యెట్లా అనను? ఆమె చిటికిన వేలు తాకడానికి లోకాలన్నీ, వెయ్యి నా వంటి జీవనాల్ని యియ్యవొచ్చు. యెట్లా అసంతుష్టిని తెలపను? ..........కాని కొన్నాళ్ళకి భరించడం కష్టమయింది. నా జీవనం నీచమై పోతోంది .........

ఒకరోజు మధ్యాహ్నము, తోటలో కలుసుకున్నాము. చెట్ల చుట్టూ బంగారు నీరులాగు యెండ, చల్లని నీడ, గాలి, సర్వే చెట్లలో సంగీతం, పద్మావతి చెయ్యిని ముద్దుపెట్టుకున్నాను. ఆమె నన్ను కావలించుకుని ముద్దు పెట్టుకుంది.

"ఆ యెదురు దిబ్బమీద యెవరున్నా వుంటే మనని చూసి వుండ వొచ్చు." అంది.

"నాకు ఆ సంగతి తట్టలేదు." అని దూరంగా జరిగాను.

"పోనీ. చూస్తే, యిప్పుడేంచేస్తాం. అయిందేదో అయింది."

అని నన్ను దగ్గిరిగా లాక్కుంది.

"యెవరు చూసినా లెక్క లేకపోతే, మనకి యెంత బావుంటుంది? యిష్టంవచ్చినట్టు వొస్తో, పోతూ యెవరిభయం లేకండా, యెంతసేపన్నా నీతో స్వేచ్ఛగా, వుండాలని వుంటుంది నాకు."

యెప్పుడూ వొకరిదగ్గిర వొకరం పడివుంటే నాకు బావుండదు..... అయినా, రాధా- యేంలాభం చెప్పు, జరగడానికి వీలులేని యీ సంగతులన్నీ జరిగితే బావుండుననుకుని? యీ ఆలోచనలన్నీ యెందుకునీకు? యిప్పుడు

నీ దగ్గిర వున్నాను చాలదా?........ముద్దుపెట్టుకో. యీచిన్ని నోరు చాలదా నీకు? యింకేం కావాలి?"

"యింతేనా మనిద్దరం అనుభవించ గలిగేది? అంత అందాన్నీ, సౌందర్యాన్నీ, యెందుకు వృథాగా పోగొట్టుకోవాలి? పొద్దస్తమానమూ నువ్వు నా దగ్గిర వుండాలి. ఎప్పుడూ నా పక్కన నీ అందం ప్రకాశించాలి. అప్పుడప్పుడు మబ్బులో నించి యెండకనపడి, పోయినట్లుంది, యిప్పుడు. సగము కంగారుతో వొస్తాను, తృప్తిలేకండా వెడతాను. నాకు లోకమంతా చీకటయింది. నువ్వే వెలుతురు. కాని అప్పుడప్పుడు మెరుస్తావు, నాకళ్ళని మిరిమిట్లు గొలుపుతూ"

చేతిమీద మొహం ఆనించి, నాకేసి నిదానంగా చూసింది.

"నిన్ను తృప్తి పరచడం చాలా కష్టం, రాధా. యిక్కడ యిప్పుడు హాయిగా, వెలుతురుగా, సంతోషంగా లేదూ?"

"నువ్వు కావాలి నాకు. అంతా, యెప్పుడూ కావాలి."

"యింత యిచ్చినా?"

"యింకా కావలి, పద్మా! నువ్వు నాతో వొచ్చెయ్యి, యిప్పుడైనా. నువ్వు నాజీవనాన్ని అందంతో, ఆనందంతో, సఫలం చెయ్యటం లేదను కోను. కాని యిట్లాంటి నిమిషాల కోసం కనిపెట్టుకుని వుండడం చాలా కష్టంగా వుంది.—— తెల్లవారగట్ట యెంతో అందమైనది, ఆహ్లాదకరమైన రంగులతో యెంతో బావుంటుంది. కాని యెప్పుడూ తెల్లవారగట్టగానే వుంటే. యెన్నడూ సూర్యుడు రాకపోతే, యెట్లా వుంటుంది?——నాలోకమంతా ఆగిపోయింది. పనియేమన్నా చేస్తున్నానా? నిన్ను కలుసుకోవాలనే ప్లాను తప్ప యింకేమిలేదు నాజీవితంలో. నీతో కలిసి లోకంలో హాయిగా, స్వేచ్ఛగా, కష్టపడి పనిచేసి బతకాలని వుంటుంది నాకు. నువ్వే నా పక్కన యెప్పుడూ నిశ్చయంగా వుంటేనా!........యీ గోడల్లోంచి యివతలికి రాలేవా? నాకోసం, నా ప్రేమకోసం, నా ఆనందం కోసం, యీ భాగ్యం లోంచి. యీ మేడల్లోంచి..................

"ఆగు, చెప్పేది విను ముందు."

మొహం చిట్లించి, పెదిమలు బిగించి, ఒకనిమిషం ఆగింది.

"నేను రాను. నా కిట్లానే బావుంది. యిప్పుడు లేదూ సంతోషంగా? రహస్యమూ, అందమూ అయిన, యెవరికీ తెలీని, యెవరికీ అర్థంకాని ప్రేమ మనిద్దరికీ"

"అదంతా సరే, నేనేమీ చెయలేనుగా నువ్వు లేనిదీ. మరి నువ్వు కావాలి నాకు, మొగాళ్ళకి యెట్లావుంటుదో తెలీదూ నీకు?

నా జుట్టు పట్టుకు లాగి, "యిప్పుడు నీకు లేదు? యింకా యేం కావాలి?" అంది.

"బహిరంగంగా, భయపడకుండా నా దానివి కావాలి"

"వీల్లేదు."

కొంచెంసేపు వూరికే కూచున్నాము.

"నీ అభ్యంతరమల్లా, యిదంతా యింకొకర్ని మోసంచెయ్యడమనేనా?"

"అవును."

"నువ్వు అట్లా అనుకుంటే, పోనీ, మానేద్దాములే"

ఆమె మొహంవొంక చూశాను కళ్ళనిండా నీళ్ళున్నాయి.

"అప్పుడు దాచడానికి యేమీవుండదు. సరేనా! నీకేం? నీకేం లక్ష్యం!"

"లక్ష్యమా అని అడుగుతావా? యిదే నా జీవనం ఆనందం. నా బతుకంతా యీ ప్రేమలో లీనమయింది. పద్మా, నా పద్మా; యీ నీచపు జీవనం వొదిలేసి వొచ్చెయ్యి నామాట వినవూ, నువ్వు రాక నాకు లోకం లేదు. నా ప్రాణం నువ్వు, నా మనోహారిణివి; నిజం. భయంలేకుండా నాతో వొచ్చెయ్యి; నేనున్నాగా! ఐశ్వర్యం, సౌఖ్యం, వుండదు. కానీ లేకపోతేనేం? రావూ? నన్ను......

పద్మావతి కళ్ళు కోపంతో భగభగలాడాయి, అసలే ప్రకాశవంతమైన ఆ కళ్ళు!

"యిది నిర్మలమైన జీవనంగా కనపడటం లేదూ, రాధా: నేను నీకు నిర్మలమైన దాన్ని కామా? నన్నింతవరకు నువ్వు తప్ప యెవరూ......"
ఆమె కళ్ళవెంబడి నీరు బొట బొట పడ్డది.

''నిర్మలము కాదన్నానా? కాని యిట్లా యెంతకాలం నిర్మలంగా వుండగలం? యీ దొంగతనం మన సంతోషాన్నంతా పాడు చెయ్యడం లేదూ? యింకా యిట్లా స్వచ్ఛంగా వున్నప్పుడే వొచ్చెయ్యి, రా. పద్మా! రా. నీకు తెలీదూ నా కెట్లావుందో, నీపాదాలమీద పడి బతిమాలుకుంటా, రా. యేమీ కష్టంగావుండదు, తరువాత, యిద్దరం కలిసి పని చెయ్యవచ్చు. నువ్వు నాదగ్గర వుంటే, యెంత వుత్సాహంగా..........

''యేమిటి మాట్లాడుతున్నావు, రాధా! పనా! యేంపని! కౌన్సిలే నా? నీకేం మతిపోయిందా? నేను నీతో వొచ్చేసిన తరువాత! యిక్కడ న్యాయ మూర్తి! అక్కడ నీ భార్య! పిచ్చివాడా, నీ మొహం యెవరు చూస్తారు? నేను నీతో వచ్చేసి నీ జీవనాన్ని పాడుచేసుకో నిస్తానా? పనా? యింక పనేమిటి! యిద్దరం వొకరి మొహం ఒకరు చూసుకుంటూ వొంటరిగా యేంతోచక, కునికిపాట్లు పడుతో, కూచోవాలి. నేను రాను, రాధా, నేను రాను, కావలిస్తే నా దగ్గిరికి రావడం మానెయ్యి, మనిద్దరి హృదయాలూ పగలకొట్టి పారెయ్యి, అదే నయం. కాని మనిద్దరికీ ఒకరిమీద యింకొకరికి అసహ్యం పుట్టేట్టు చేసుకోను. మనిద్దరి పేరూ నలుగురి నోళ్ళలో పడేసి, యీ నీచులూ, ఆ వెధవలూ, నీ కాలికింద దుమ్ము తుడవడానికి పనికిరాని తుచ్ఛులూ! అందరకీ మనని యేమాటంటే ఆమాట అనడానికి వీలు కలుగచేసి,......వొద్దు వొద్దు ఆడదానికోసం చెడిపోయిన మొగవాణ్ణి సంఘం యెన్నడూ గౌరవించదు.

ఆమె లేచి చటాలున నుంచుంది. నేనట్లానే ఆమె పాదాల దగ్గిర కూచున్నాను.

''యిక్కడికి ప్రేమకోసం, ఆనందంకోసం, వొచ్చాను. నాకు నువ్వు యెంతో సౌందర్యాన్ని యిస్తావని నువ్వేమో యెప్పుడూ యీ సొదంతా తెస్తావు; యీ దౌర్భాగ్య మంతా, ఛీ...ఛీ....

ఆ మొహంలో దయ కోపం, కనపడ్డాయి. కళ్ళు తీక్షణంగా మెరిశాయి.

......................................................

---

# అ ప జ య ం

నే నన్నట్లే అయింది. యీ రహస్యం యెన్నాళ్లు దాగుతుంది? ఒకరోజు పద్మావతి దగ్గిరికి మామూలు ప్రకారం వెళ్ళాను. తన గదిలో మంచం దగ్గిర చూస్తో కూచుని వుంది. లేత యెండ వొచ్చి, నున్నని చెంపల్ని తాకుతోంది. సంతోషంతో. పొట్టి చేతుల చొక్కా వొకటి వేసుకుని, సన్నని వుత్తరయ్యం పైన కప్పుకుంది. రక్తము చిమ్మి మెరిసే ఆమె వొంటిరంగు, మెడ నునుపు, వుత్తరయ్యంలోంచి కనపడే నడుము వొంపు, జుట్టు మెడమీద పడే చోటి సొగసు! మెల్లిగా వెనకాలే నడిచివెళ్ళి మెడచుట్టూ చెయ్యేసి, ముద్దు పెట్టుకోడానికి వొంగాను. వెంటనే నాకేసి తిరిగి, నన్ను నెట్టివేసి కోపంతో చూస్తో నుంచుంది. తలెత్తాను, పక్క తలుపు దగ్గిర న్యాయమూర్తి మావంక ఆశ్చర్యంతో చూస్తో నుంచుని వున్నాడు. ఒకనిమిషం అట్లానేవుండి మా దగ్గిరికి నడిచి వొచ్చాదు.

"యిల్లాంటిదేదో జరుగుతుందని అనుమాన పడ్డాను."

తన భార్య వంక తిరిగి

"యేమోగాని, యిట్లాంటి పని నువ్వు చేస్తావనుకోలేదు. అట్లా అనుకోడం అసహజం, దుర్మార్గ మనిపించింది."

నావంక తిరిగి మర్యాదగా

"మీరింక వెళ్ళకూడదూ?" అన్నాడు.

"వెళ్ళను. యిప్పుడు చివరికి మీకు తెలిసింది గనక మాట్లాడ వలసిన విషయాలున్నాయి."

"వొద్దు. ఆయనతో నన్ను మాట్లాడనీ, నువ్వు వెళ్ళు, ప్రస్తుతం" అని పద్మావతి అంది.

"నేను నిన్ను వొదలి వెళ్ళను."

న్యాయమూర్తి నన్ను మరిచి పోయినట్లు, పద్మావతి వంకే చూస్తున్నాడు.

"నావిషయంలో నువ్విట్లా చెయ్యడం, యేమీ న్యాయంకాదు. నువ్వెట్లా వుంటానంటే అట్లా వొప్పుకున్నాను. అయినా నీకు తృప్తి

కలుగలేదేమో: నీకు అంతకన్న యెక్కువ కావాలని నాకు యెన్నడూ తెలియచెయ్యలేదు. నాకే తెలుస్తుందని వూహకున్నావేమో!... యిప్పుడేం చెయ్యను?"

నావంక తిరిగి. "యిప్పుడేం చెయ్యను? నేను పవిత్రంగా, వున్నతంగా, చూసుకునే యీమెని...మీరు....మీరు..." కోపం జెలసీ మొహంలోకి వొచ్చేశాయి.

'రాధా, నన్ను నాభర్తతో వదిలి వెడతావా లేదా?''

"చెయ్యవలసిన పనిఒకటే. యెక్కువ మాట్లాడి లాభమేమివుంది? న్యాయమూర్తిగారూ, మాయిద్దరికీ చాలా ప్రేమ ఒకరిమీద వొకరికి. యిద్దరం యిక్కణ్ణించి వెళ్ళిపోతాము. మీకు కష్టంకలగచెయ్యము. కష్టం కలగడానికి కూడా కారణంలేదు. అసలు నిజంగా మాయిద్దరికే పెళ్ళి అయింది....''

యింక యేమన్నానో జ్ఞాపకం లేదు; అంతాగోల; అందరం కలిసి ఒకసారే మాట్లాడటం మొదలుపెట్టాము. చాలాసార్లు నేను ''పద్మావతి నాభార్య. యీశ్వరుడి కళ్ళముందు నేనే ఆమెభర్తని'' అన్నాను.

యింక పద్మావతి నాదేనని నాకు నిశ్చయ మేర్పడ్డది. న్యాయమూర్తికి తెలీడం నాకు సంతోషంగానే వుంది. యింక వెంటరాక యేం చేస్తుంది? పద్మావతి యిదివరకంతా రానంటోంది సంగతి తెలిసింది గనక నువ్వన్నా చెప్పి పంపించు అనేమోస్తరుగా మాట్లాడాను న్యాయమూర్తితో. అతను, ''యీపోట్లాట భార్యాభర్తలం మాలో మేము సద్దుకుంటాము. మధ్యనువ్వేదో గోలపడతావేమిటి? నువ్వెవరు?" అనే మోస్తరుగా మాట్లాడాడు.

"మీయిద్దరేమిటి? మేమిద్దరం'' అని నేను పద్మావతి పక్కన నుంచుని, న్యాయమూర్తినీ, సంఘాన్నీ, లోకాన్నీ "యేమంటారిప్పుడు?'' అని ధిక్కరించాలని నావుద్దేశ్యం. వెంటనే పద్మావతి నాతో వచ్చేస్తుందనే అనుకున్నాను. చుట్టుకున్న వుత్తరయ్యంతోటే, యింకేమి బట్టలు తీసుకోడానికి కూడా బహుశా వీలుండక, యెట్లా నాతో బయిటికి వస్తుందా అని కూడా సందేహ పడ్డాను. యిద్దరం ఒకరి చేతులు వకరం పట్టుకుని,

ఆయింటిలోంచి అట్లానే బయలుదేరి చెన్నపట్నం వీథుల్లో నడిచిపోవడం కూడా కళ్ళకి కట్టినట్లు కనపడ్డది. హోటల్లో పద్మావతికూడా వుండవచ్చా? వీల్లేకపోతే, యెక్కడికి వెళ్ళాలి? అని సందేహం కూడా కలిగింది. యింతలో మళ్ళీ పద్మావతి మాటల ధోరణి చూస్తే వెంటనే వచ్చేసేటట్టు లేదు; న్యాయమూర్తి ఆమెని వొదిలేట్టూ లేడు. పద్మావతి యెంతకీ న్యాయమూర్తి వొంక చూస్తోంది గాని, నాసంగతి ఆలోచిస్తున్నట్టేలేదు. తొణక్కుండా, బెణక్కుండా యీతమాషా చూస్తున్నట్టు నుంచుంది.

"నీతో రావడం నాకు యిష్టలేదని యిదివరకే నీతో చెప్పలా?" అంది.

"అతన్ని పంపెయ్యి. చాలా ఘోరం. యిట్లాంటివి జరిగితే నేను వొప్పుకోను." అన్నాడు న్యాయమూర్తి.

"మరి నాయిష్టం నాదని మీరు వొప్పుకోలేమా?"

"యేమిటి? యిట్లాంటి పనులు చెయ్యటానికా?"

"పద్మా, అతనో, నేనో, యెవరో నీయిష్టం ఆలోచించుకో. యిఖ యిక్కడ యెట్లావుంటావు? యీయింటో......"

పద్మావతి చప్పున నామీదికి తిరిగింది.

"యెందుకు వుండకూడదూ యిక్కడ? యిద్దరిలో యెవరినో యేరుకోడం యేమిటి? యెందుకు యేరుకోవాలి? యెవరో వొకరు వుండి తీరాలా యేమిటి నాకుమొగనాథుడు? మీయిద్దరూ అఖర్లేదు. న్యాయమూర్తి గారూ, నేను మీవద్దాన్ని కాదు, మీరు చెప్పినట్లు మీఆజ్ఞకి లోబడి వుండేందుకు. రాధా, నీవాన్నికాదు, నీతో వొచ్చెయ్యడానికి. నాకోసం మీయిద్దరూ యెందుకిట్లా, బొమిక ముక్కకోసం కుక్కల్లాగ, పోట్లాడ తారు? యిది నాయిల్లు. నేనిక్కడే వుంటాను"

కళ్ళు కోపంతో మెరిశాయి. ఆచక్కని నోరు వొణికింది. చంపలు యెర్రనయినాయి. జుటు కొంచెం రేగింది మాయిద్దరినీ సేవకులమల్లే చూసే రాణిలాగనుంచుంది ఠీవిగా. న్యాయమూర్తి నన్ను యింట్లోంచి వెళ్ల మన్నాడు పద్మావతి నాతోవస్తేనేగాని కదలనన్నాను, నాసంగతి మీకెందుకు?

మీరెవరు నాకోసం పోట్లాడ్డానికి? అన్నట్లు కోపంతో చూస్తో నుంచుని వుంది, మహాశక్తిలాగు. కొంచెంసేపు మాతగాదా చూస్తోనుంచుని, పక్క తలుపు తీసుకుని యింటోకి వెళ్ళి గడియ వేసుకుంది. న్యాయమూర్తీ నేను ఒకరిమొహం వకరు చూసుకుంటో నుంచున్నాము. పోట్లాట వుద్రేకం తగ్గింది. పద్మావతి నాతో రావాలని నేనూ, రానియ్యనని అతనూ గొణుక్కున్నాము. యేమనుకొని యేంలాభం, మేమిద్దరం మధ్య! మాఅసహాయత్వం యిద్దరికీ తట్టింది. యింక చేసేదేమిటి? నేను యింటికి వెళ్ళాను.

తరవాత నేనేంచేశానో, యేమనుకున్నానో జ్ఞాపకంలేదు. వొళ్ళు తెలీని, బాధకరమైన క్రోధ మనుభవించినట్టు మాత్రం జ్ఞాపకంవుంది. ఆ సాయంత్రం పద్మావతి ఉత్తరంరాసింది, నాతో రానన్నది. మమ్మన్ని చూసినందుకు న్యాయమూర్తిమీద కోపం చూపింది. తప్పక నాతో ఆమె వచ్చితీరాలని జవాబు రాశాను. కొన్నాళ్ళైన తరవాత ఆరాత్రి జరిగిన సంగతులన్నీ తెలిశాయి. న్యాయమూర్తి వెంకటరత్నాన్నీ, సుదర్శనాన్నీ, తంతియిచ్చి ఆరాత్రికే రప్పించాడు. పద్మావతి పారిపోతుందేమో ననే భయంతోటీ, జెలసీతోటీ, అతనికేం చెయ్యాలో తోచలేదు. వెంటనే ఆలోచనలు మొదలు పెట్టాడు. యింక పద్మావతి నాతో స్నేహం మానుకుంటే న్యాయమూర్తి అంతా మరచిపోయి క్షమిస్తానన్నాడు. పద్మావతి తనస్వేచ్ఛ తనకే వుండాలని అంది. అన్నలిద్దరూ, ఆమెమీద అధికారంచేసి, యేడిపించి తిప్పలుపెట్టి, అణగతొక్కారు. రాత్రి యింకా యేమీ తేలలేదు. పొద్దున్నే నేను వెళ్ళాను, పద్మావతిని చూడాలని. ముందు వెంకటరత్నం సుదర్శనం కనపడ్డారు.

"యేమోయి, రాధా!" అన్నాడు సుదర్శనం.

వాళ్ళిద్దరి మొహాలూ చూడగానే నాకు వొళ్లుమండింది.

"యెప్పుడు వొచ్చారు?....పద్మావతిని చూడాలని వొచ్చాను యెదీ?"

"నిద్రపోతోంది ... యీవేళ చలిలేదు" అన్నాడు వెంకటరత్నం.

"యేమిటోయ్, యిదో చిక్కు తెచ్చిపెట్టావు? చస్తున్నాం యెటూ తెముల్చుకోలేక! పోనీ, న్యాయమూర్తి యేదన్నా మునగాడన్నా, పను

పాప్రియుడన్నా అయితే అనుకోవచ్చు. యెంతో బుద్ధిమంతుడయ్యేను." అన్నాడు సుదర్శనం.

"నేనేం గోల చెయ్యలేదే?"

"నువ్వెందుకు గోలచేస్తావు? నువ్వెప్పుడూ చెయ్యవు."

"యెంతో కాలంనించి మాయిద్దరికీ యీ ప్రేమ వుండనే వుంది. యిప్పుడు పైకి వొచ్చింది. అంతే"

పైకి రావడమేంటి! టపాకాయల మంటలాగు భగ్గుమంది. చుట్టు పక్కల అందరూ యిదేమిటా అని చూస్తున్నారు. మంట అందరికీ బాగానేవుంది, చూడ్డానికీ తమాషాగా. వేడిమాత్రం మధ్య మాకొచ్చింది."

"యింకైనా గోలలేకండా పద్మావతీ నేను యీ పేపుల్నించి వెళ్ళి పోతే..........."

"పద్మావతి వొస్తానంటోందా?"

"యిదుగో చూడు. పద్మావతి నీతో రావడం నేను వొప్పుకోను. నేను రానీను" అన్నాడు వెంకటరత్నం దుర్భరంగా,

"నువ్వెవరు వొప్పుకోడానికీ, వొప్పుకోక పోవడానికీ!"

"యెహే, పద్మావతి యెట్లానూరాదు. న్యాయమూర్తి వొదిలేస్తానంటంలేనిదే! యెవరూ యెవరిని వొదలడానికీ వొప్పుడంలేదు. అదే వొచ్చినచిక్కు" అని అందుకున్నాడు సుదర్శనం.

"మరి మేమిద్దరం..........."

"మీరిద్దరూ హాయిగా అనుభవించారు, యిన్నాళ్ళూను. మరి తెలివి తక్కువ యెందుకు చేశారు? యెక్కడన్నా పెనిమిటి చూశేందుకు వీలౌస్తారా?"

"నేను వొప్పుకోను. యింతటితో యీవ్యవహారం ఆఖరవాలి." అని వెంకటరత్నం అరిచాడు.

మళ్ళీ సుదర్శనం అన్నాడు. "చూశావా, రాధా, అసలే సంఘం పాడవుతోంది. యీలేచిపోవడాలు యెక్కువై పోయినాయి. పరువూ ప్రతిష్టలూ, యెగిరి పోతున్నాయి, వొక్కదెబ్బని. యెక్కడికన్నా మితిఅంటో వుండాలి. వీల్లేదు.

వాళ్ళు అంతా ఆలోచించుకునే వొచ్చారు. మొత్తానికి యిట్లా కబుర్లు చెప్పి పంపేశారు నన్ను ఆ వేళకి. సాయంత్రం మళ్ళీ వొచ్చేప్పటికి బంగాళా తలుపులు మూసేసి వున్నాయి. తోటవాళ్ళ నడిగాను. యింట్లో అందరూ యెక్కడికో చెప్పకుండా మధ్యాహ్నం రైలుకి వెళ్ళిపోయినా రన్నారు. నిలువునా నీరైనాను. అప్పుడేమీ అర్థంకాలేదు. చాలా రోజుల తర్వాత జరిగిందంతా తెలిసింది నాకు. పద్మావతిమీద కేకలువేసి. దడిపించి. లోకానికంతా వెల్లడిచేస్తామని, అలిసిపోయిందాకా వూపిరాడకుండా అందరూ కలిసి గోలపెట్టి, ఆమెని యింట్లోంచి వెళ్ళకొడతామని, కోర్టులో పిర్యాదు చేసి, నన్ను తిప్పలు పెడతామని. భయపెట్టి వాళ్ళందరూ కలిసి నా పద్మావతిని రైలెక్కించి సింగపూరు తీసుకువెళ్ళారు. పద్మావతికి జబ్బుచేసింది. ఆమెకోసం న్యాయమూర్తి యింత శ్రమ పడతాడని నేననుకోలేదు. పద్మావతి మీద అతనికి ఒకవిధమైన ప్రేమ వుందనుకుంటాను. కాని అంతకంటె తీవ్రమైన జలసీ అతని హృదయాన్ని కాల్చేసి వుంటుంది. నానించి తప్పించాలని, నాదగ్గిర్నించి లాగాలని, తనే గెలవాలని, పద్మావతిని తనకే వుంచుకోవాలని, అతను తీవ్రంగా పనిచేసి వుంటాడు. కుక్కలు పోట్లాడతాయే గుడ్డపీలిక కోసం, అట్లా ఆపీలిక చిరిగినాసరే. చివరికి అది తనకు మిగిలితేచాలు! రెండోకుక్క యేడుస్తో పోవాలి. ముందు పద్మావతి తనదైతే, తరవాత ఆలోచిస్తాడు, తనకి ఆమెమీద ప్రేమవున్నదీ. లేనిదీ.

యేమి చెయ్యాలో నాకు తోచలేదు. పద్మావతి నన్ను వొదిలి న్యాయమూర్తి దగ్గిరికి మొదట వెళ్ళినప్పుడు కూడా యింత బాధపడలేదు. అప్పుడు తన యిష్టంవొచ్చి వెళ్ళింది బాధ అంతా నావొక్కడిదే. ఇప్పుడు ఆమెని బలవంతంగా లాక్కువెళ్ళారు. నన్ను ప్రేమించి నాదగ్గిరికి రావాలనే పద్మావతిని. ఆమె నాకోసం. నేను లేక, నాదగ్గిరికి రావాలని యెంతబాధ పడుతోందో? యేంచెయ్యను? యెక్కడవుందో తెలీదు. యెవరూ చెప్పరు. వొక్కణ్ణి నేను. నా విరోధి గొప్పఅధికారి, న్యాయమూర్తి; అతని వెనకాల కావలసినంత డబ్బు; బంధువులు; సంఘం; ధర్మం; న్యాయశాస్త్రాలు; ప్రభుత్వం; ప్రజలు; అందరూనూ. అందులో పద్మావతి అతని చేతుల్లో వుంది. పద్మావతి పెరిమిటి యింట్లో వున్నన్నాళ్ళూ, యేంచేసినా యెవరికీ పట్టదు. పైగా న్యాయమూర్తి అంతవాడి భార్యతో, పద్మావతి అంత అంద

మైన, తెలివిగల స్త్రీతో సంబంధమున్నవాడికి సఘంలో గౌరవంకూడాను! కాని యిప్పుడు బహిరంగంగా, నేను యింకొకరి భార్యని, పద్మావతిని, కావాలంటే, నాదంటే, ఒకరూ నావేపు పలకరు.

పద్మావతి యెక్కడవుందో తెలిస్తే మాత్రం యేంలాభం? ఆమె నాతో వస్తుందా? కావలసే నన్ను వొదిలి వెళ్ళిందేమో! కాని ఆమె నన్ను అట్లా వొదులుతుందా! నామెద అంత ప్రేమగల పద్మావతి! అయినా పద్మావతే రానని పట్టుబడితే, వాళ్ళు లాక్కుని వెళ్లగలరా? యేమైనా, ఆమె వుద్దేశ్యం తెలుసుకోవాలి. న్యాయమూర్తి వాళ్ళా యెక్కడికి వెళ్లారో తెలుసుకోడానికి ప్రయత్నించాను. ప్రతినిమిషం పద్మావతి దగ్గిర్నించి, వుత్తరమో, టెలిగ్రామో వొస్తుందని యెదురు చూస్తో కూచున్నాను. లేక పోతే, పద్మావతే తప్పించుకుని రావచ్చు. యింటోవుంటే యీఆలోచనలతో, బాధతో, మెదడు బద్దలయ్యేది. యింటికి వెడితే, యింటికి వుత్తరం కబురూ వొచ్చిందేమోనని అనుమానమూ, తొందరా! పద్మావతిన్ని యేం కష్టాలు పెడుతున్నారో? పశ్చాత్తాపపడి నాదగ్గిరికి రావాలనుకుంటే, కయిదు చేసి యేంచేస్తున్నారో! చివరికి ఆన్యాయమూర్తి వంటరిగా బలవంతంచేసి, కసిమీద ఆమెని యేంచేస్తున్నాడో? యీ ఆలోచనలతో నామెదడు వుడికి పోయింది. రాత్రిళ్లు నిద్రలేదు. నిప్పుల్లోమల్లే ఒకటే పొర్లడము. బాధ పడలేక చెయ్యి కరుచుకుని అరిచేవాణ్ణి. యేమి చాతగాక, పోలీసు సూప రెంటుతో మాట్లాడాను. పద్మావతి యెక్కడవుందో తెలుసుకోమన్నాను.

"ఆమె పెనిమిటితో ఆమె వెడితే యింకోరు అడిగేదేమిటి?

"వెళ్ళలేదు. బలవంతంగా లాక్కుపోయినారు."

"పెనిమిటేగా! యింక బలవంతమేమిటి? రాననడానికి భార్యకి అధికారంలేదు."

అదీ "లా" యీనాగరికమైన దేశంలో.

ఒకరోజు వెంకటరత్నం కనపడ్డాడు, క్లబ్‌లోకి వెడుతో. అతన్ని పిలిచి, పరుగెత్తుకువెళ్ళి చెయ్యిపట్టుకున్నాను.

"పద్మావతిని యేంచేశారు? యెక్కడ వుంది?"

"సిగ్గులేకండా, నాచెల్లెలి పేరెత్తుతారేం? మీరెవ్వరు?" అని బిగ్గరిగా అరిచాడు.

"నేను పద్మావతిని చూడాలి. నన్ను చాలా మోసం చేశారు. నేను చూసి తీరాలి" అని రహస్యంగా అన్నాను.

"నాచెయ్యి వొదలండి, మీరెవరో! ముందు." అని మొహంమీద కొట్టాడు.

యీయిరవై రోజులు పడ్డ బాధ అంతా రగులుకొచ్చింది. దవడ పగిలేట్టు కొట్టాను అతన్ని. కిందపడ్డాడు. ముక్కూ నోటా రక్తం వొచ్చింది. నౌకర్లూ, స్నేహితులూ అడ్డంవొచ్చారు

"నాచెల్లెలి పేరెత్తడానికి నువ్వెవరు?" అని అరుస్తున్నాడు.

నాకు సిగ్గువేసింది. మధ్య పద్మావతిపేరు దుమ్ములోకి యీడుస్తున్నాము.

"ఛీ, వెంకటరత్నం, నీకేం మతిపోయిందా! నీ చెల్లెలు యెవరో నాకేంతెలుసు? నిప్పుపెట్టె యియ్యమ్మని అడిగితే, మరి నన్నెందుకు నిష్కారణంగా కొట్టావు?" అని వెళ్లిపోయినాను.

వెంకటరత్నం, తన క్లబ్ స్నేహితులతో, నేను తనచెల్లెల్ని నిష్కారణంగా వెంటతగిలి బాధిస్తోవుంటే, నాబాధపడలేక, అవమానానికి దడిసి, పెనిమిటిచాత శలవు పెట్టించి సింగపూరు వెళ్ళిందని చెప్పాట్ట. వూరంతాపుకారు. నాస్నేహితుడు వొకడు వొచ్చాడు.

"రాధా, యిదేమిటి వూళ్ళోఅంతా యిట్లా చెప్పుకుంటున్నారు? న్యాయమూర్తిని, నీపెళ్ళాన్ని నాకు వొప్పచెపుతావా, లేకపోతే నిన్ను చంపనా? అని కొట్టావుట, ఆమె ముందరే! ఆమె పాపం నీ బాధపడలేక, ఆమె మానానికీ, తనభర్త ప్రాణానికీ భయపడి, అతను భయంలేదంటోవుంటే, బలవంతంచేసి అతనితో పారిపోయిందట, నిజమేనా?"

అంతా అబద్ధమనిచెప్పి అతన్ని పంపేశాను, అప్పుడు తెలిసింది నాకు వీళ్ళందరూ సింగపూరు వెళ్ళారని.

మర్నాడు శింగపూరు బయలుదేరాను. ఆయింటి కావలివాడు న్యాయమూర్తివాళ్ళు రెండురోజుల కిందటే వెళ్ళిపోయినారన్నాడు. నాకు గుండెల్లో రాయిపడ్డది. పద్మావతి తన పట్టుదలమాని, లోబడివుండాలి. లేకపోతే మళ్ళీ చెన్నపట్నం యెందుకు వెడతారు? వానలో తడిసి, ముద్దై వొణుకుతూంటో, స్టీమరెక్కాను వోడిపోయినాననిపించింది. ఆశంతా చచ్చిపోయింది. పుద్రేకమంతా చల్లపడ్డది. వాన, గాలి. తడి, కొండలమల్లే లేచిపడే సముద్రపు కెరటాలు. యింక పద్మావతీ, సంతోషమూ నాజీవితానికి వున్నాయా? అయిపోయింది. బతుకంతా పాడుచేసుకున్నాను, యిందు కోసం. పేరుప్రతిష్టలు, పోయినాయి. పద్మావతీ పోయింది. నాపద్మావతి. నాకు దైవమిచ్చినభార్య. నన్నూ స్టీమరునీ, తృణమువలె వూగించే ఆసముద్రపు అలలవలె లేచాయి నామీదికి, సంఘమూ, నీతీ, ఆచారమూ! ఆఅలలని ఆపవొచ్చు, యీదవొచ్చు, జయించవొచ్చుగాని, పురాతన ఆచారాన్ని సంఘాన్ని జయించడం అశక్యం. లొంగిపోవాలి.

నేను చెన్నపట్నం వెళ్లేటప్పటికి, అందరూ అక్కడే వున్నారు. పద్మావతి దగ్గిర్నించి నాకు వుత్తరం వొచ్చివుంది. అది చాలా అధైర్యంతో బతుకంటే విసుకుపుట్టి రాసినదానివలె వుంది. తనకి జబ్బుగా వుందనీ తననీ, నన్నూ, రక్షించడానికి, తను లొంగిపోయినాననీ, నన్నుకూడా అన్ని ప్రయత్నాలు మానెయ్యమనీ, రాశింది. మేమిద్దరం కలుసుకోకూడదు, చూసుకోకూడదు, వుత్తరాలు రాసుకోకూడదని న్యాయమూర్తి షరతులు పెట్టాడు. నన్ను ఆషరతులకి వొప్పుకోమంది. నన్ను తను వొదిలేసినట్లు కనపడవొచ్చుననీ, కాని తనకి నాదగ్గరకి రావలన్నా యిప్పుడు వీలుకాదనీ. తను బలహీనురాలననీ. న్యాయమూర్తికి చాల పలుకుబడి వుంధనీ; మేము గెలువలేమనీ, రాసింది. ఆవుత్తరం చదివేటప్పటికి నా మనసంతా దేజారయింది. పద్మావతి పోయింది; చచ్చి పోయింది; ఆమె దూకుడూ, రోషం. ధైర్యం, రిసెంటు మెంటు, సాహసం; అవన్నీ యేవీ? సంతోషమేలేదు. అధైర్యం, భయం, నెమ్మది. యింకెక్కడి పద్మావతి! ఒక్క నెలలో నా పద్మావతి యిట్లా అయిపోయిందా? యింక యెట్లా బతుకుతుంది? బతికి లాభ మేమిటి? ఒక్కసారి ఆమెని చూడాలి. నిజంగా యిట్లా అయి

పోయిందేమో చూడాలి. - ఆమెనే అడిగి తెలుసుకోవాలి. వాళ్ళ యింటికి వెళ్ళాను; ఒకరోజు యింక నిలవలేక, సుదర్శనం కనపడ్డాడు.

"రాధా, నీకు తెలీదూ, నేను నీ పక్షమని? పద్మావతి, నువ్వూ, కలిసి హాయిగా వుండే విధమే వుంటే, మొదటే నీకు సహాయం చేసి వుందును. యేమి లాభంలేదు, నువ్వే ఆలోచించుకో, మీ యిద్దరూ కలిసి వెళ్ళిపోయి నారనుకోండి. మీ బతుకేమవుతుంది? యేంబతుకది? అదిగాక, న్యాయ మూర్తి వొప్పుకోలేదు, పద్మావతిని వదలడానికి. అతను తలుచుకున్నా డంటే. నిన్ను చేతులో నల్లిని నలిపేసినట్లు నలిపేస్తాడు. అందరూ అతని వేపే, యిట్లాంటి, విషయాల్లో లోకమంతా పెనిమిటి పక్షం వుంటుంది. అతను పెట్టిన షరతులకి నువ్వు వొప్పుకు తీరాలి."

"నేనా వొప్పుకొనేది?"

"వొప్పుకోక చేసేదేముంది? యింకా పద్మావతిని తీసుకు వెళ్ళా లనే నీ ఆశ? యెక్కడికి, గోతులోకి?

"మీరు చేసినపనికి వుత్తరాలు.వా గ్మూలాలూ, సంపాయించాడు"

"యెట్లా?"

"యెట్లానయితేనేం? అదంతా అవసరం లేదు. పద్మావతిని యింట్లోంచి తరిమేస్తాడు. నిన్ను జైలుకి పంపిస్తాడు. పోనీ దానికన్నా వొప్పుకోడానికి సిద్ధపడితే. పద్మావతికి జబ్బుగావుంది. నీతో పారిపోయి, తిండీ తిప్పలూ, లేకుండా అష్ట కష్టాలూ, పడే స్థితిలో లేదు. నీకు, ఆఖరికి నీకన్నా జాలి లేదూ? నువ్వు పిలిస్తే అంత జబ్బుతోటి వొస్తుందేమో! జాలిపడి ఆమె కోసం నువ్వు వూరుకోవాలి రమ్మనక. దానికి మునపటి చురుకుదనం పట్టుదల అన్నీ పోయినాయి. నీతో వెడతానని పోట్లాడ్డానికి కూడా శక్తి లేదు. నీకింక ఆ పద్మావతి యెందుకు? పూర్తిగా న్యాయమూర్తి స్వాధీనం అయిపోయింది. యెందుకు వృధాగా అల్లరి చేస్తావు, మా అందరినీ?"

నాకు నిరాశ కలిగింది.

"నే నెందుకు చూడగూడదు? ఒకసారి చూడాలి." అన్నాను.

"వీల్లేదు"

"యేమో! మీరందరూ యేమేం చెప్పారో ఆమెతో"

"నీకు పద్మావతి రాసిన వుత్తరాలు చూసుకోలా?"

"అయినా చూడాలి, ఆమె నోటినించి 'నన్ను వెళ్ళిపొమ్మ'ని రావాలి. యిట్లాచెయ్యడం మీకు న్యాయంకాదు."

"ఆడవాళ్ళ స్వభావం వేరు. తెలీదూ నీకు రాధా? ఆడవాళ్లకి బుద్ధి బలం తక్కువ. మనం జాగర్త చెయ్యాలి వాళ్ళని, వాళ్ళు యెప్పుడో అన్నమాట మనం పట్టుకొని అప్పుడట్లా అన్నావె ఆమాట నిలుపుకో మనడం అన్యాయం. నువ్వుగనక, పద్మావతి దగ్గిరికి వెళ్లి, 'రా' అని సరిగా అనవలసిన మోస్తరుగా, అన్నావంటే, కొండమీది నించన్నా సరే దూకుతుంది, నీ దగ్గిరికి కాని ఆమెకి నిజంగా దూకాలని వుండదు. అయినా దూకుతుంది; కాళ్లు విరుగుతాయి."

"అందుకునేనా, నేనామెని చూడ్డానికి వీల్లేంది?"

"అవును"

"అయితే పిలవనులే, రమ్మని."

"నిజం?"

"నిజం"

..................................................................................................................................................

..................................................................................................................................................

నాలుగు నిమిషాల్లో మళ్లీ నా ప్రాణం, నా పద్మావతి వొచ్చి యెదురుగా నుంచుంది. జబ్బుగా వున్నట్లు చూడగానే తెలుస్తోంది, వోడిపోయిన కళ కనపడుతునే వుంది. నడకలో, మాటల్లో దూకుడే పోయింది. చూపుల్లో అగ్ని వుత్సాహం సిర్లక్ష్యం, మాయమయినాయి.

"పద్మా! వోడిపోయినామా? యింతేనా?"

"రాధా, మనం చెయ్యగలిగిందేమీ లేదు. మనం కట్టుబాట్లకి వ్యతిరిక్తంగా నడిచాము అనుభవించాలి."

"ఒకరి నొకరు వొదిలా?"

"యింక చేసేదేముంది?"

"యెదిరిద్దాము నేను కైదులోకి వెడతాను, లోబడడం నేను వొప్పుకోనునువ్వుకూడా సరేనను,"

సుదర్శనం "రాధా!" అన్నాడు.
వూరుకున్నాను.
"సరే, అయితే యింకేముంది? యేంలేదు."
"అది కాదు రాధా! నిన్ను అట్లా పాడుకానీను నేను."...
"యిప్పుడు బాగున్నానా? బాగుపడతానా?"
"మళ్లీ యెక్కడికీ వెళ్లకేం, పిచ్చి పుట్టినట్లు?"
"యింక నేనేమైతేనేం? యెందుకు బతికి?"
సుదర్శనం "రాధా?" అన్నాడు.
"నీపనీపాలిటిక్స్, కౌన్సిల్?"

"అవా యిప్పుడు పట్టింది నాకు! నువ్విట్లా జబ్బులుపడి, విచారంగా వున్నావే, నేనేమీ సహాయం చెయ్యలేనూ? నీ జీవితంలోకి సంతోషం తీసుకురాలేను? నీకే సంతోషం కలుగుతుందంటే యెక్కడికన్నా వెడతాను; యేమన్నా చేస్తాను. నాకింకేముంది లోకంలో"

"అంత దిగులుగా వుండనులే, నిన్ను తలుచుకుంటో వుంటా! గడిచిన రోజుల జ్ఞాపకం యెవరూ తీసెయ్యలేరు కదా? అవి యిస్తాయి నాకు కావలసిన సంతోషం, ఓర్పు, నువ్వు దిగులుపడకు యెట్లావున్నావో తెలీదేమో యింకనాకు, సరే వెళ్ళు, నిన్ను వొదిలేశానని కోపం వుంచుకోకు నీదగ్గిరికి రావడానికి వీల్లేక పోయింది, ధైర్యం చాలలేదు."

యేడవడం మొదలు పెట్టింది. భయమంటే యెరగని నా పద్మ, నా స్నేహితురాలు, నా చిన్నప్పటి కొంటెపిల్ల, యేడ్చింది; అధైర్యంతో, దిగులుతోటి యెన్నడూ యేడవగా నేను చూడని పద్మ, కళ్లల్లోంచి జలజల నీరు ముద్దు చంపలమీదనించి కారుతో, ఆగర్వంగా వొంపుతిరిగిన గడ్డం కిందనించి, పొరిలివొచ్చే దుఃఖంతో వూగే సుందరమైన, నాప్రాణమైన వక్షంమీద రాలుతో యేడ్చింది, గుండెలు పగిలినట్లు, నాకూ యేడుపొచ్చింది.

"పద్మా?" అన్నాను.
యిద్దరం కావిలించుకుని యేడ్చాము. కన్నీళ్లతో తడిసిన ఆమొహాన్నంతా ముద్దుపెట్టుకున్నాను. విడిపడ్డాము చివరికి, నేనూ నాపద్మ.

## నేనూ శకుంతలా

టిబెట్టుదేశం. చూడడానికి కొందరు యీదేశంనించి బయలుదేరుతున్నారనీ, ప్రాణానికి తెగించినటువంటి వారే వారితో చేరి వెళ్ళవొచ్చుననీ తెలుసుకుని, వాళ్ళతో ప్రయాణమైనాను. యీదేశంలో, యీమనుషుల్ని చూస్తో పద్మావతిని మరిచిపోవడం కష్టం. మరిచిపోకపోతినా, పిచ్చి ఆస్పత్రే గతినాకు. మూడేళ్ళుతిరిగి మళ్ళీ యీదేశం వొచ్చాను. మాయింటికి వెళ్ళాను. యింకెక్కడికి వెళ్ళను? తండ్రిగారి వొంట్లో బాగాలేదు. ఆయనకి వుపచారంచేస్తో శకుంతల అక్కడేవుంది. అవూళ్ళో వుండడానికి బుద్ధివెయ్యలేదు; కాని నాయనగారు నన్ను వొదలడానికి యిష్టపడడం లేదు. నాగది కిటికీకి యెదురుగా ఆతోట ప్రతినిమిషం కనిపిస్తోంది. ఒకవేళ కాలచక్రం తిరిగి చిన్నప్పటి పదహారేళ్ళ పద్మావతి ఆతోటలో కనబడుతుందేమో! మరిచిపోయిన పద్మావతిని ఆతోట మళ్ళీ అంతటి ఆవేశంతోనూ నాహృదయంలో ప్రతిష్టించింది. రాత్రింబవళ్లు పద్మావతి ధ్యాసే. పద్మావతి కావాలి. ఆమెలేనిది బతుకు దుస్సహము. ఒక్కసారి ఆమెను చూసి తీసుకురావాలి. యెక్కడికన్నా యిద్దరం న్యాయమూర్తికి అందకండా పారిపోవాలి. నాయనగారి తదనంతరం, నాఆస్తినంతా అమ్మి పద్మావతితో యేదూరదేశమో పారిపోవాలి అని నిశ్చయం చేసుకున్నాను. మూడు నెలలయింది. శకుంతల సంగతి మనసులో యేమూలాలేదు. ఆమె కూడా నాతో వొక్కమాటా మాట్లాడలేదు.

ఒకరోజు సావిత్రి వొచ్చింది. సావిత్రి మాచిన్ననాన్న కూతురు, మాయిద్దరికీ చిన్నప్పటినుంచి స్నేహం. చదువుకున్నిది; తెలివిగలది, సావిత్రి అత్తవారి వూరు శకుంతల వూరే. కుటుంబాల్లో తగాదాలు తీర్చడం, పెళ్ళిసంబంధాలు కుదర్చడం, యివన్నీ ఆమెకు చాలా యిష్టం. యేగొప్ప రాజ్యానికో మంత్రిగా వుపయోగించవలసిన బుద్ధిని యీతగాదాలు తీర్చడంలో ఆమె వినియోగిస్తోంది. నేనేదో పిచ్చిమోహంలోపడి కొట్టుకుంటున్నానని, యీసంబంధం కుదిర్చి, నాకు పెళ్లి చేయించడానికి సావిత్రే కొంతవరకు కారణం. నేను శకుంతల జోక్యం పట్టకండా తిరుగుతోవుంటే యీఅన్యాయానికి బాధ్యత తనదే అనుకుని, నేను చేస్తున్న పనులన్నీ

కనిపెట్టి, వీలైనంతవరకు తెలుసుకుంటోనే వుంది.

ఆమె వొచ్చింతరువాత చాలరోజులు భయంతో ఆమెని తప్పించుకు తిరిగాను. కాని ఒకనాడు సాయింత్రం చంద్రకాంత చెట్టుదగ్గర నన్ను పట్టేశింది.

"రాధా, నీవుద్దేశ్య మేమిటి; చెప్పు. నీకు పెళ్ళిఅయింది. ఆఅమ్మాయి యెదిగింది న్యాయమాలోచించు. ఒకయేడా రెండేళ్ళా! పెద్ద పనిషై యెనిమిదేళ్లయింది"

యేంచెయ్య మంటావు?"

(నవ్వుతో) చెయ్యమనేదేముంది? నీకేతెలుసు. మూణ్ణెల్లమట్టి ఒక యింటోవున్నారు. ఒకసారి పలకరించావా? అట్లా సిగ్గుపడి దూరాన వుంటే, దానికి హృదయమే లేదనుకున్నావా? నీసంగతులు మేము మాట్లాడుకుంటోవుంటే, మెల్లిగా తలుపుచాటున నుంచుని వింటుంది. పాపం, పైకియేమీ చెప్పదు, సిగ్గు."

"సరేలే; కాని నేనెందుకు టిబెటు వెళ్ళానో తెలీమా నీకు?"

"సరే!"

"ఆమెకు తెలుసునా?"

అందరికంటె యెక్కువ తెలుసు. చెన్నపట్నమంతా మోగిపోలా మరి, మీసంగతి? యేంచేసిందో తెలుసునా శకుంతల? యెట్లావుంటుం దోనని, నీపద్మావతిని యింటికివెళ్ళి చూసిందట. "నేను రాధాకృష్ణగారి భార్యనంటే, అమె భయపడ్డది, తనని తిట్టడానికి వొచ్చిందేమోనని. నువెట్లావుంటావో, చూడడానికి వొచ్చానందిట. యిద్దరికి స్నేహ మయింది."

నాకు శకుంతల దగ్గిర్నించి పద్మావతి సంగతులు వినాలి అని పించింది. కాని యేమొహం పెట్టుకుని అడగను?

పోని, అదంతా అయిపోయిందిగా? యెదో చిన్నతనంలో ఇట్లాంటివి యేవో ప్రతివారికీ వుంటాయి. దానికి యేమీ అనడంలేదు. కాని

యెన్నాళ్లయినా అదేపట్టుకు కూచుంటే! యిప్పుడు నీభార్యను చూసుకో డానికేం? అందరూ యిట్లానే వున్నారా లోకంలో?''

నాకన్న అయిదేళ్ళు చిన్న సావిత్రి; యిట్లా మాట్లాడుతోంది, యేభై యేళ్ళ దానివలె! యీఆడవాళ్లకి యెంతలో వొస్తుంది వృద్ధాప్యం!

"అదంతా అయిపోలేదు, యింకా మళ్ళీ నేను పద్మావతిని చూస్తే........"

"చూడ్డం వుత్తదిలే. పోయినయేడు యీవూరొచ్చారు. ఒక్క మొగపురుగు కంటపడ నిచ్చాడుకాదు ఆమెని. నువ్విక్కడ లేవని తెలుసు. అయినా ఆడవాళ్ళనన్నా తిన్నగా మాట్లాడనీలేదు ఆమెతో.... అదిసరేలే. కాని నువ్వింకా పద్మావతిని మరచిపోలేదూ?"

లేదు. టిబెటులో వున్నప్పుడు మరిచిపోయినా ననుకున్నాను. పద్మావతిని తలుచుకోనేవాణ్ణికాదు. కాని, మళ్ళీ, అట్లాచూడు-ఆతోట వొంక చూసిందిమొదలు- తలయెత్తినప్పుడల్లా గుండె చెరువై పోయింది. హాయిగా పెళ్ళిచేసుకున్న భర్తనే ప్రేమిస్తో వుండే నీకేంతెలుస్తుంది, ఆబాధ!''

"తెలీదూ? రాధా, పైకి ఆడవాళ్లం అట్లాగే కనపడతాం కాని మాహృదయాలు విప్పిచూడగలిగితే, మాకు నీబాధ అర్థమవుతుందో లేదో తెలుస్తుంది. మొగాడవుగనక నీకు సాగింది యింతవరకన్నా. మేము నోరెత్తి లాభంలేదు. పరిగెత్తే మనుస్సుని తెంపుకుని, లోపల కుక్కుకుని, కలలుకంటో, పడివుంటాము, గతిలేక....పద్మావతిని దూషించావుకాని, నిన్ను వొదిలేసిందని, అంత ధైర్యంకలిగి, అంతమాత్రం తనప్రేమకోసం పోట్లాడిన ఆడదేదీ? ఆమెకూ, ఆమె ధైర్యానికి భక్తితో నమస్కారం.''

పద్మావతి నాజీవితేచ్ఛని లాగేసింది. నాకు మిగిలిందేమీలేదు ఆమెకాక నాకు లోకమేలేదు. రెండోసారి ప్రేమించడం నాచాతకాదు. శకుంతలనిచూస్తే నాకావిధంగా మనసుకి తట్టడమేలేదు."

"మరి చెన్నపట్నంలో.........శకుంతలచెప్పింది."

అవును. కాని అప్పుడే మరిచిపోయినాను, అదా ప్రేమ. చూడు. ప్రేమంటే యెట్లా కాల్చుకతింటోందో, రాత్రింబవళ్ళు! ఒక్క నిమిషం విశ్రాంతినివ్వకుండా? యవ్వనం, సౌందర్యం, మోహం, వీటి అనుభవం అయిపోయింది. శకుంతలకి యిచ్చేందుకు యేమీలేదు."

"యింక మరిచిపోవడమంటో యేమీలేదా యేమిటి?"

"లేదు."

"సావిత్రికి కోపంవొచ్చింది."

"నీవుద్దేశ్యం యేమిటి? పద్మావతి నిన్నే తలుచుకొంటో కూచుందనా? శకుంతల నడుగు. అందరిలాగే తనసంసారం తను చూసుకుంటో హాయిగావుందట. మధ్యనీకేవొచ్చిందంతా........"

నేనామెవంక నిదానించి చూశాను.

"యిప్పుడు మళ్ళీ కడుపులాగుంది."

నామొహం మాడిపోయింది. కోపం, యీర్ష్య, దుఃఖం, వొచ్చేశాయి. గుండెల్లో పట్టుకున్నట్టయింది. వూపిరాడదు.

"శకుంతల వెయ్యిచావులు చస్తుంది, యింకోణ్ణి తననితాకనిస్తుందా? పద్మావతిగోలేగాని రత్నమంటి శకుంతల నీళ్ళకి కనపడదు. యీ మొగవాళ్ళెప్పుడూ యింతే. మల్లెపువ్వులాగు యేకళంకం లేకుండా, నీకోసం ఆకాశంవేపు తపస్సుచేస్తో కూచున్న శకుంతల కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యడానికి పనికిరాదు నీకు."

"పద్మావతికి పిల్లలున్నారనే తెలీదునాకు," అన్నాను యెండిపోతున్న పెదిమలతో.

"మూడేళ్ళకాలేదు. యిద్దరూ-నువ్వువెళ్ళిన ఆరునెల్లకే ఆడపిల్ల,

తరవాత సంవత్సరానికే కొడుకు. యిదేనా నిన్ను తలుచుకోడం? నేను ఆమెని యేమీ అనడంలేదు. అంతకంటె యేంచేస్తుంది? యింకేం చాత కానప్పుడు. నోరుమూసుకుని యెవరిసంసారాలు వాళ్ళు చూసుకోడం బుద్ధిమంతుల లక్షణం. ఆమెపని బాగానేవుంది. యెటొచ్చీ నీకు! పైపెచ్చు నీమూలంగా యేపాపం యెరగని శకుంతలకి."

"పద్మావతి యిట్లాచేస్తుందని అనుకోలేదు."

"యేమనుకున్నావు?"

"యేమో!"

"పోనీలే, యిప్పటిసంగతికానీ."

"పాపం, శకుంతలని, శూన్యమైన నాజీవితంలో యెట్లా కలుపు కోను! నానించి ఆమెకి యేంసుఖం కలుగుతుంది?

"నువ్వు యిట్లావొదిలేస్తే, యేంసుఖం?"

"నేను పద్మావతిని మరిచిపోలేను. మరిచిపోనన్నాళ్ళు, యెవరినీ ఆవిధంగా కన్నెత్తిచూడలేను."

"నువ్వు పద్మావతిని మరిచిపోయి తీరాలి. శకుంతలతో స్నేహంగా వుండడం మొదలుపెడితే. ఆదేమరచి పోతావు. అంతేగాని. యేంపని లేకండా ఆతోటవేపు చూస్తో. కిటికీదగ్గిర కళ్లనీళ్ళుపెట్టుకుంటో కూచున్న వున్నన్నాళ్ళు, యింతే. యెన్నాళ్లని అట్లాయేడుస్తావు. చూడు, యెట్లా చిక్కిపోయినావో అన్నం తింటున్నావా అసలు? చచ్చిపోయినతరువాత శవాన్ని కావలించుకుని యేడిస్తే యెంతలాభమో, యిదీ అంతేలాభం. అయినా అసలు పద్మావతిని మరిచిపోయినావనే నాఅభిప్రాయం. నువ్వు ప్రేమిస్తున్నదల్లా ఆమె నీకులేదనే దుఃఖాన్ని, ఆసంగతి మరిచిపో. యెంత చూసినా, యెంతయేడ్చినా, ఆతోట మళ్ళీ పద్మావతిని కల్పించలేదుకదా?"

నాకళ్లల్లో నీళ్ళుకమ్మాయి. నాపద్మావతి, వెన్నెట్లో నాపక్కన

పడుకున్న చెలి, నాకు గిలిగింతలుపెట్టి నవ్వే నానవ్వుల నిధానము, అమ్మో...............నేను లేచాను.

"చా, యీపాత గాయాలకి మందుగా, శకుంతలని కావిలించుకోన? యెన్నడూ అట్లాంటిపని చెయ్యను."

"యిప్పుడు నువ్వు చేస్తున్నపని యేమిటి? ఆఅమ్మాయికి దిక్కెవరు? ఆమెతండ్రి పోయినాడు. యీముసలాయిన కాస్తా........."

"అయితే దిక్కులేదని, నన్ను.........."

"యిదివరకు దయలేక యేడిపించావు ఆ అమ్మాయిని; యిప్పుడు దయయెక్కువై యేడిపిస్తున్నావు. ఆమెకి నువ్వేమీ యియ్యఖర్లేదు. శకుంతల యేమీ అడగటంలేదే? తక్కిన భర్తలవలె వుంటేచాలు. తక్కిన భార్యలందరూ ప్రేమకావాలని యేడుస్తున్నారా యేమిటి? అట్లా యేడిస్తే యేభార్యా యేభర్తదగ్గిరా వుండదు. వాళ్ళందరూ సుఖంగాలేరూ? శకుంతలకీ అంతే కావలసింది."

ఆరోజునుంచి, పద్మావతీ,ఆమెపిల్లలూ, నామనోవీధిలో సంచరించడం మొదలు పెట్టారు. కాల్చే పెద్దమంట మండిస్తో, యెందుకో ఆబాధ అర్థంకాదు. పద్మావతిని నేను వొదులుకుని వొచ్చినతరువాతకూడా, ఆమె యేడుస్తో, వొంటరిగా వుండాలనే గావును నావుద్దేశ్యం? ఆమెకి యెందరు పిల్లలువుంటే నాకెందుకు? కాని అన్యాయమూర్తి నాపద్మావతిని లాక్కుని నన్ను వెక్కిరించినట్టుంది. నేను వొదలినా పద్మ వాడిదికాకూడదు: ఆడదాని విషయమై మొగవాడికి "యిది నా వొస్తుఘా హక్కు" అనే మాటలు పోవుగావును? గాని పద్మావతికి పిల్లలు వున్నారనడంతో, ఆమెని చూసి, వొప్పించి, యెక్కడికో తీసుకువెళ్ళవచ్చుననే ఆశ పోయింది. ప్రియుడి కోసమన్నా సరే. హృదయమున్న ఆడది పిల్లల్ని వొదలదని నాకు తెలుసు.

అయిదేళ్ళయింది. నాకొక కొడుకూ కూతురూ మా నాయనగారు పోయినారు, శకుంతలకి చాలాభక్తి, తెలివీ, ప్రేమా వున్నాయి. నేనంటే పాలిటిక్సు వొదులుకున్నాను. మావూరి చుట్టుపక్కల వున్నవారి అభివృద్ధి కోసం పాటుపడడం మొదలుపెట్టాను. వారి విద్య ఆరోగ్యం, వ్యవసాయం, యివన్నీ వృద్ధి చెయ్యడంకోసం ప్రయత్నించాను. నేనంటే అందరికీ ప్రేమా, గౌరవమున్నూ, ఒక ముద్రాలయంపెట్టి వార్తాపత్రిక ప్రచురణకూడా చేస్తున్నాను. దాంటో స్త్రీస్వాతంత్ర్యము, ముఖ్యవిషయం. అసందర్భంగా నాకు గొప్ప సంఘసంస్కర్త అనేపేరు వచ్చింది. విధవావివాహం, రజస్వలానంతర వివాహం వాళ్లసమూహం నా పేరుకూడా కలుపుకున్నారు.

................................................................................

ఒకరోజు నేనూ శకుంతలా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వుండగా వుత్తరాలు వొచ్చాయి. వాటిల్లో ఒక కవరుపైపేరు దస్తూరి చూసే టప్పటికి పూర్వజన్మంలోంచి జారివొచ్చిన బంగారు తీగెలాగు కనపడ్డది. విప్పి చదివాను, పద్మావతిరాసిన ఆ పెద్దవుత్తరం.

నిన్నుతలచుకుని, తలుచుకుని, చివరికి యీవుత్తరం రాస్తున్నాను. నువ్వు పిల్లలతో సంసారంతో ఆనందంగా వున్నావంటే, నాకు సంతోషంగా వుంటుంది. కాని, మళ్ళీ, నాహృదయం కాల్చేస్తుంది అది తలుచుకుంటే.

నాకూ పిల్లలున్నారని నీకు తెలుసుననుకుంటా. తల్లినైతే నేనెట్లా వుంటానో ఆలోచించావా? యిద్దరున్నారు. చిన్నవాడికి రెండేళ్ళు. మనిద్దరం మంచివాళ్ల మయినామని, జీవితంలో సిరపడ్డామని, సంఘానికి పుపకారంచేసే వాళ్లమైనామని. యీబిడ్డలే సాక్షులు. యింక భయం లేకండా వుత్తరాలు యెందుకు రాసుకోకూడదు? రాధా, నాధ్యాసంతా నీమీదే. సగంప్రాణం నువ్వే. యాభైమందిపుట్టినాఅంతే. యీజన్మం యింక రాదుకదా మళ్ళీ! యెన్ని వాగ్దత్తాలన్నా వుణ్డీ! నిన్నుమాత్రం తలుచుకోకుండా వుండను.

నాబతుకులో చాలాభాగం సంసారంకింద పాతేశాను. యింక

యిప్పుడు వూరుకోను. నన్ను చంపి పాతేశారు. తప్పుకుని పైకి లేచా నిప్పుడు. గోరీలోంచి తలపైకిపెట్టి "రాధా యేంచేస్తున్నావు?" అంటున్నాను. నాచిన్నప్పటి రాధా, యేంచేస్తున్నావు? ఎట్లా వున్నారు? అంతా రాయి యేమనుకుంటున్నావు? నీజీవితం యెట్లావుంది?

దొంగతన మేమీలేదూ. నీయిష్టం వొచ్చినట్టు జవాబురాయి. యెవరూ చూడరు. చూసినా భయంలేదు. నాకెందు చెఖలేమి, రాధా: నీకు పుత్తరం రాయాలని మొదటినించి అనుకుంటున్నాను నామనసే నీదగ్గిర మాట్లాడగలిగితే, నీకెన్నో వార్తలు వొచ్చివుండేవి యిదివరకే. మొదట లొంగిపోయి నోరుమూసుకున్నాను. యింక వూరుకోను. కష్టంగా వుంది మోహాగ్ని చల్లారి, స్నేహభావం యెక్కువైనా, యింకా యీఅభ్యంతరాలు, కైదూ, యెందుకు? మనిద్దరిమధ్యా యెంతచరిత్ర జరిగింది.:. యెన్ని అనుభవాలున్నాయి? నీసంగతి ప్రతివాళ్ళనీ అడిగి తెలుసుకున్నాను ఎవరేంచెప్పినా భద్రంగావిన్నాను. నీ పేరెవరన్నా యెత్తితేచాలు వాళ్ళ దగ్గిర చేరేవాన్ని నీ పత్రిక ప్రతిసారి చదువుతున్నాను..........మళ్ళీ పాలిటిక్సులోకి రాలేదేం యేమిటి? "సోషల్ కాన్ఫరెన్సు"లో నీపేరు పడుతోంది? వాళ్ళందరితో నువ్వెట్లా కలుస్తున్నావు? ఎక్కడా పెళ్ళాలు దొరక్క బోడిగుళ్ళకి జుట్టుపెంచి పెళ్ళిచేసుకునేవాళ్లూ పిల్లల్ని మాగేసి, సమర్తాడించి, యేవరికో డబ్బిచ్చి కట్టిపెట్టేవాళ్ళూ, కులంవదిలి కంపుకొట్టే నీచులపక్కన కూచుని భోజనంచేసేవాళ్లూ వీళ్లతో నీకెట్లా స్నేహం కుదిరింది? వీళ్లు మనయిద్దరి సంబంధం పాపమంటారు, తెలుసునా?....
... 'పాలిటిక్సు'లోకి వొస్తే, నిన్ను యెక్కడన్నా, దూరాన్నించన్నా చూడడానికి వీలయ్యేది. యెక్కడో వొకచోట, ఒంటరిగా కాకపోయినా, యెదురు పడుతోనే వుండేవాళ్లం.

రాధా, నాబతుకు దుర్భరంగావుంది. పుట్టినతరువాత యిరుపై అయిదేళ్లు, నాఅంత అదృష్టవంతురాలులేదు; కాళ్ళు భూమిమీదా, తల మేఘాల్లో; నవ్వితే చాలు, ఆకాశం, సముద్రం, మనుషులూ నావాళ్లవుతారన్నట్టుండేది. యిప్పుడు యెందుకూ పనికిరాని దాన్నయినాను. యిద్దరు పిల్లల తల్లిని అంతే! పెద్దపిల్ల, అమ్మాయి, దాన్నిచూస్తే నాకు ప్రాణం.

దానికికళ్ళూ, జుట్టూ చూస్తేచాలు. సమస్తం జ్ఞాపకం వొస్తాయి. పట్టులాగుండే జుట్టు చేత్తో దువ్వుతో, యెక్కడో ధ్యానించే దానికళ్లల్లోకి చూస్తోపదేళ్ళ చిన్నదానవుతాను. అట్లానేతృప్తిపడతాను. అర్ధరాత్రి దానిపక్కలో పడుకొని ఆవేశంతో కావిలించుకుంటే, దానికేమీ అర్థంగాక, పెద్దనిట్టూర్పు విడిచి, అటువేపు తిరుగుతుంది. రెండోవాడు అబ్బాయి. వాడుమొద్దు. తండ్రి మళ్ళీ అచ్చు.........యింతే నేను లోకంలో జేసింది, యేంగొప్ప? మాయింటో పిల్లి తొమ్మిది యీతలీనింది. నాకంటెనయం.

యిప్పుడు న్యాయమూర్తికి నాకూ యేంసంబంధంలేదు, ఆయిన వంశానికి కావలసినవాడు పుట్టాడు. నాదాధ్యత తీరిపోయింది. పొగబూ, రాత్రీ ఒకరితో వొకరం వొక్కమాటా మాట్లాడుకోము; కనపడం కూడాను. కాని యింటికిమాత్రం భద్రంగా పారాకాస్తున్నారు, అప్పటినుంచి. నన్ను చూడడానికి మొగవాళ్ళు యెవరూ రావడానికి వీలులేదు. కాని నాకేంచింతలేదు. నువ్వులేకపోయిన తరువాత, కైదీనయితేనేం, స్వేచ్ఛవుంటేనేం? అందుకునే పోట్లాడకండా యేంచేసినా వూరుకున్నాను.

రాధా, నేను రోజులు చాలా విచారంగా గడుపుతున్నాను. యేం చెయ్యడానికి తోచదు. యెందుకు బతకాలో తెలీదు. నువ్వుకూడా యిట్లా బాధపడు తున్నావా? ప్రేమ కాల్చేసింది. యింక లోకంలో శాంతియెక్కడిది? జీవితం నీకు సంతోషంగా వుందా? ఆయితే ఆసంతోషం దేనివల్ల కలుగుతోంది చెప్పు. నేనుకూడా నేర్చుకుంటా........ జ్ఞాపకముందీ చిన్నప్పుడు ఆతోటలో కూచుని యీ జీవనమంటే యేమిటో చెప్పమని ఒకసారి నిన్ను ప్రశ్నలువేసి యేడిపించాను! మొండిమల్లే. యేం చెప్పలేక మిణుకుతో కూచున్నావు నువ్వు. అప్పుడు జీవితమంటే, నవ్వులూ, చెయ్యీ చెయ్యీ పట్టుకు తిరగడాలు, ముద్దులూను! నీకు యిప్పుడన్నా తెలుస్తోందా? యీ జీవితమంటే అర్థం యేమిటో?

ఆతోట యెదురుగా యెట్లా బ్రతుకుతున్నావు? యెట్లానన్నా మనం అక్కడ వుండకూడదూ మళ్ళీ?

వుత్తరం ముగించాను. తలపైకి యెత్తేప్పటికి, శకుంతల నిదానంగా చూస్తోంది నావొంక. నా కళ్ళ నిండా నీళ్ళున్నాయి. యింతసేపూ పద్మా

పతితో చెన్నపట్నంలో వున్నాను గదులూ, యిల్లూ, గుర్తుపట్టలేదు నేను కొంతసేపు.

"యెక్కడినించి?"

"పద్మావతి దగ్గిర్నించి."

"మీరిద్దరూ వుత్తరాలు రాసుకోకూడదుగా!"

"అవును, మొదట అదేషరతు."

"మిమ్మన్ని, జవాబు రాయమందా?"

"పెద్దవాళ్లమైనాము, బిడ్డల్ని కన్నాముగదా, అయిపోయిందేమో, అయిపోయింది. స్నేహంగా యెందుకు వుండకూడదు అంటోంది."

"ఆమె పెనిమిటికి తెలిస్తే?"

నాకు శకుంతల దగ్గిరినించి వుత్తరాలు దాచుకోడం మామూలు లేదు. కాని యీవుత్తరం యెట్లా యివ్వను, చూడమని.? జేబులో పెట్టుకుని వెళ్లిపోయినాను, యేమనుకుందో యేమిటో.?

ఆరోజునించి మళ్లీ పద్మావతి ప్రవాహంలో పడ్డది నామనసంతా. పెద్దజబాబు రాశాను. ఆమెకి. రెండురోజుల్లో జబాబు వొచ్చింది,

యిట్లానే వుత్తర ప్రత్యుత్తరాలు మూడు సంవత్సరాలు నడిచాయి. తరవాత మెల్లిగా వుత్తరాలు రావడం తగ్గింది. మళ్ళీ మానేశాము. నాసంఘసంస్కరణం, వార్తాపత్రికా పనులలో నేను పూడిపోయినాను.

---

# త్యాగం

ఆసంవత్సరం కాలికట్‌లో సంఘసంస్కరణ సభకి నన్నధ్యక్షుణ్ణిగా వేసుకున్నారు. సుందరమైన మలబారు చూడడం కూడా కలిసివొస్తుందని కొన్నిరోజులు ముందుగా, బయిలుదేరాను. మెల్లిగా పల్లెటూరునించి పల్లెటూరికి, స్టీమరుమీదా, పడవమీదా, కాలినడకనూ, ప్రయాణంచేస్తో నింపాదిగా తిరుగుతున్నాను. అయిదోరోజు మధ్యాన్నానికి ఒక చిన్నవూరు చేరుకుని, భోజనం చేసేటప్పటికి మూడుగంటలయింది. పక్కన కొబ్బరితోటలోకి షికారు వెళ్ళాను. దానితరువాత సన్నని సముద్రంపాయివుంది. ఆపాయి అవతల రెండోవొడ్డున యెదురుగుండా అందమైన కొండలు. వాటివెనకాల మళ్ళీ సముద్రపు హోరు. ఆకొండల్లోంచి సన్ననిగాలి వీస్తోంది. కొండవెనక అస్తమిస్తున్న సూర్యుడు, ఆనీళ్ళల్లో తళతళమని మెరుస్తో, చూడ్డానికి వీల్లేకండా చేశాడు. ఆపాయవొడ్డున చెట్లకింద, కొండలకేసి చూస్తోనుంచునివుంది వొక ఆమె. ఆమెత్తని జుట్టు, కోల చంపలూ, నడుము లావణ్యం, చూసేటప్పటికి నాగుండెలు కొట్టుకున్నాయి ఆవీపు, నున్నని వేళ్ళాడేచేతులు, యింకెవరికున్నాయి? సుందరమైన ఆస్తలమూ, పద్మావతి రూపమూ, నకల్లేమో అనుకున్నాను. కాళ్లు వొణికాయి. నడవలేకపోయినాను. ఆమె చప్పునవెనక్కితిరిగి నన్ను చూసింది. ఆకళ్ళే, ఆకొంకెనోరే, ఆవాలుబుజాలే, అసన్నతనమే, ఆతెలివిగల ముఖమే! ఆకళ్లనిమాత్రం, చేతుల్నిమాత్రం చూసినాసరే? నాపద్మావతిని గుర్తుపెట్టేవాణ్ణే! ఆమెఆశ్చర్యంగా, సంతోషంగా మెరిసే ఆకళ్ళు విప్పి,

"నువ్వే?" అంది.

"నేనే?"

"ఆకాశంలోంచి వూడిపడ్డావా?"

"అంత అదృష్టమా? అదేచేత్తైతే యిదివరకెప్పుడో వూడిసీసొ చాలదెగ్గిర పడేవాణ్ణి."

ఆపక్క బంగాళాల్లోంచి ఒక ఆమె యెవరో పద్మావతి దగ్గిరకివొచ్చి వినపడకుండా మాట్లాడింది. పద్మావతి యేదోచెప్పి పంపేశింది.

పద్మావతి ప్రవర్తన సరిగావుండేట్టు చూస్తోవుండమని న్యాయమూర్తి పంపిన ఆమెట, ఆమె.

చెన్నపట్నంలో వుండడం విసుగెత్తి యిండియా దేశమంతాతిరిగి చూస్తోంది పద్మావతి. యిప్పుడు మళయాళం వొచ్చింది. నేనెందుకు వొచ్చిందీ చెప్పాను. యింక అక్కడే కూచుని మాట్లాడుకున్నాము. ఆచల్లగాలిలో నీళ్లవొడ్డున, సాయింత్రపు యెండలో, కొబ్బరిచెట్లక్రింద కూచున్నాము దగ్గరగా. మళ్ళీ నేనూ, పద్మావతీ.

"యెప్పుడో యిట్లా కలుసుకోడం తప్పేది కాదనుకుంటా."

"యింకెక్కడా కాకండా, యింత అందమైనచోట కలుసుకున్నా" చాలా సంతోషంగావుంది నాకు !

రాధా, నువ్వు అట్టేమారిపోలేదు. బాగానే వున్నావు కాని కళ్ళల్లో అలసిపోయిన చూపువుంది. చాలా చదువుతావాయేం?"

"అవును."

"యిక్కడ అలసటఅంతా తీర్చుకో." "నీతోనే?"

"యేం? రానేవొస్తివి."

"మన వాగ్దత్తాలూ?"

"మనం కావలసి కలుసుకున్నామా? యిట్లా అప్రయత్నంగా వొకరినొకరు చూసుకుంటే..........."

"నేను అయిదుగంటలకి వెళ్ళాలనుకున్నాను. వెడతాను."

సరిగా పూర్వంవలెనే కళ్లకిందికివాల్చి, ఆగి, ఆలోచించింది.

"యిట్లా వెళ్లిపోవడంన్యాయంకాదు. అందులో యిట్లాంటిచోట యిట్లాంటి సాయంత్రం నన్ను వొక్కదాన్నీ వొదలి వెడతావా? యెన్ని సార్లు నిన్నిట్లా కలుసుకోవాలని ఆశపడ్డాను? నిన్ను వెళ్లనీను. వెళ్ళడానికి వీల్లేదు. రాత్రిపడ్డాక వెళ్ళు. దేవుడిచ్చాడు యీసాయంత్రంమనకి. మాట్లాడుకుందాం రా."

"నాకుచాలా అలసటగావుంది; మనస్సూ, దేహమూ నీతో యిట్లా వుండడం, యెంత హాయిగావుంది? యెంత సంతోషంగావుందో మాట

లలో చెప్పలేను. చెప్పాలనుకుంటే యేడుపు వచ్చేస్తోంది. మళ్ళీ నిన్ను చూడడం, మళ్లీ నీతో మాట్లాడడం? యెన్నాళ్లకి, యెన్నాళ్లకి, పద్మా!''

దగ్గిరిగా కూచుని ఆకళ్ళతో, మళ్ళీ ఆపెదిమలతో, పద్మ వుండ వంటో వుంటే యెట్లా కదలను? నామీద "యిన్ల్ఫుయెన్సు'' వున్నవా ళ్లెవరూ లేరు.

వుండతలుచుకున్న తరవాత యిఘ యేంచేస్తున్నామా అని ఆలోచించలేదు? యేమిచేద్దామా అనే! సముద్రపుపాయలో యెదురుగా వున్న డింగీ యెక్కి. యెక్కడికో వెళ్ళిపోయినాము. వొడ్డున మనుష్యుల దగ్గిర్నించి దూరమవుతోవుంటే, యేయెక్షిణీ దేశానికో వెళ్ళిపోతున్నట్లుంది. ఒకరిమీద ఒకరం కలకంటున్నట్టుంది. నిద్రలేచి చూసుకునేటప్పటికి యెవరియింటో వారు వుంటామునావు ననిపించింది.........ఆచెరువూ, పడవా, అన్నీ నిజమేనా, కలా, మాయా, అని సందేహం. అంత అందంగావుంది. యెక్కడో ఒకచిన్నపాయలోకి వెళ్ళాము. ఆకొండలమధ్య యెక్కడికి వెడుతున్నామో మేమాలోచించటంలేదు. పడవే యెక్కడికో తీసికెళ్ళింది. అక్కడ చాలా లోతూ, నీళ్ళు గంభీరంగా నల్లగా వున్నాయి. కొండమీదనించి సన్నని నిర్మలమైన మంచినీళ్లయేరు, సూర్యకిరాణాల్లో మెరుస్తో, పొంగుతూ, దొర్లుతోంది క్రిందికి. నీళ్ళు రాళ్లకితగిలి, పైకిలేచి యీకలవలె రంగులు రంగులుగా కనపడ్డాయి. కొండమీదికి దిగాము. పడవతప్ప మాకు లోకంతో సంబంధం పోయింది. పద్మావతి పెద్దరాయిమీద కూచుంది. నేను ఆమెనిచూస్తో, కాళ్లదగ్గిర గడ్డిమీదకూచున్నాను.

"యింకనాకు నమ్మకంగాలేదు, యిదంతా." అంది.

''అన్నిటికంటే నాహృదయానికి దగ్గిరిదానవినువ్వు. మళ్ళీ కొత్త. దానివికూడాను. నువ్వెవరో? నాకు యేదో సిగ్గుగావుంది నిన్నుచూస్తే దగ్గిరిగా మాట్లాడితే, యింద్రజాలం మాయమవుతుందో కల మెలుకువ వొస్తుందో అని భయంగావుంది. యిది లోకంలో కల్లా అందమైనచోటు .....................లోకంలోకల్లా.''

"రాధా, యీజీవనం యెంత తమాషాఅయింది? ఒకదానికి వొకటి కుదరేదు. మనబతుకంతా యెందుకూ పనికిరాని పనులతో సరిపోతోంది.

యింతఅందం లోకంలోవుంది; అందమయిన స్థలాలు వొస్తువులు, భావాలు, యెన్నోవున్నాయి; కాని మన జీవితానికీ వాటికీ సంబంధంలేదు. వాటినించి దూరంచేసుకుని జీవితాలని చెడకొట్టుకుంటాము. చూడు, యీ అంచం.........నీకు జ్ఞాపకముందీ, ఆతోటలోకూచుని, నిత్య జీవనం సంగతి వాదించుకున్నాము. నువ్వేమో, యీజీవనం తరవాతయేమైనా లెఖ్ఖలేదన్నావు. నీకుయింకా యిప్పుడూ లెఖ్ఖలేదా? నీకు బహుశా అట్లాటి సంగతులు ఆలోచించడానికి తీరికవుండదు. కాని నాకు యింకపనేముంది. యీ ఆలోచనలు కాక!.........పగలుముందు తెల్లవారకట్టలేదూ? అట్లాం టిదీ యీజన్మం, ముందు జీవనానికి. నేను యింత సౌందర్యం, ఆనం దం అనుభవించిన తరవాత, అసలులేకండా నిర్యాణం అయిపోవడం, అసంభవం. యీకాస్త ఆనందమే మనము అనుభవించేది? యీ ఆటం కాలూ, యీచీదరలతో, యెక్కడో యెప్పుడూ స్వేచ్ఛగా, అందంగా వుంటాము, రాధా! లేకపోతే యీనక్షత్రాలకి, చెట్లకీ, మనహృదయ్యంలో యీప్రేమకీ, అర్థంలేదు............చూడు, చచ్చిపోయింతరవాత యింత అందంగా వుంటుందేమో! యెంత అందంగా, నిర్మలంగావుందో యిక్కడ! యెంతబావుంది! ఆయెండా ప్రేమతోనిండిన నీకళ్లూ, నువ్వునాకింత దగ్గి రిగా, యిదంతా నమ్మడానికి వీల్లేకండావుంది. మనిద్దరం కొంచెంసేపట్లో విడిపోతామంటే, యీవాళసూర్యుడికి పిచ్చెత్తిందనుకునేట్టుంది. నాతో నువ్విట్లా కూచోడమే మామూలుగా, సహజంగా, కనపడుతోంది.

రాధా, మనిద్దరం మనకి తెలీకుండానే చచ్చిపోయి కలుసుకున్నాం గావును యీస్వర్గంలో? నిజమేనేమో! మన ఆత్మలేయివి! యిప్పుడూ నిజంగామనకి జీవనం మొదలు పెట్టింది. మనంమళ్ళీ ఆలోకానికి యెం దుకు వెళ్ళాలి? యీరాత్రీ, యింకెప్పుడూ, మనకి ఆకలి వెయ్యకపోతే?.... యింకేమి అఖర్లేకండా, మనిద్దరం యిక్కడేవుంటే?........''

రాధా, నేను వెట్టిగా మాట్లాడేస్తున్నాను. నిన్ను కలుసుకున్న యీ మహా సంతోషంలో,''

కొంచెంసేపు మాట్లాడకండా ఘనీభవించిన ఆనందంతో కూచు న్నాము. లోకాన్నంతా వొదలి మేమిద్దరం యిద్దరంకాకండా వొకటయి

నట్లయింది. ఆసృష్టి సౌందర్యములో, ఒకరం యింకొకరి సౌందర్యంలో లీనమైపోయినాము. ఒకరినొకరు తాకనన్నా లేము తాకాలనేబుద్ధేలేదు. తాకనక్కర్లేదు. యీభౌతిక శరీరాలకి అతీతమైన ఆనందం అనుభవించాము అంతసేపూ. మాయిద్దరికీ శరీరాలు లేనట్టేవుంది. ఆ కాంతి, వొంటరితనం. మామనసులకి మాత్రం వేశాయి.

సాయంత్రం అయింది. ఆకొండల్నీ, ఆకాశంలో మబ్బుల్నీ వెలిగించి సూర్యుడు అస్తమించాడు. అంతా యెర్రగా అయింది; నీళ్లన్నీ ఆకాశమంతా, కొండలూ. అన్నీ యెరుపు యిదేస్వర్గ మనిపించింది. దానితరువాత సన్నగా వెన్నెల వొచ్చి, చిన్నగాలికి కదిలే నీళ్లలో మెల్లిగా ఆడుతో నవ్వుతోంది చిన్నపిల్లలాగు. ఆస్థలం, ఆసౌందర్యం, అనిశ్శబ్దం. మాసాంగత్యం వొదలి, రావడం కష్టమయింది చాలా. ఆఖరికి బయలుదేరాము.

"యింకా ఒకరోజు వుండరాదూ, నువ్వు?" అని మధురంగా అడిగింది పద్మావతి.

"పద్మా, యిదంతా స్వర్గంలాగుంది! యిప్పటివరకు కాని"

"అయితే వెడతావా? వొద్దు"

"వెడతాను"

''వుండు'' అని యెంతో మృదువుగా, హృదయమూడి పడేట్టు, యెంతో అర్థంతో అంది.

"వొద్దు, వొద్దు"

కొంచెంసేపు వూరుకుని,

"నిజమే నువ్వనేది నిజమే! ఒక వేళ నువ్వు వుంటానన్నా నేనే వెళ్ళమనేదాన్ననుకుంటా. నిజమే! మళ్ళీ ప్రేమించుకోడం మొదలుపెడతాము. ఒకరిని వొకరం వొదలము. చివరికి యిద్దరికీ యిష్టంవుండదు అది. మళ్ళీ మొదలు, నన్నునువ్వు అడగడం, బలవంతం చెయ్యడం, నేను బెట్టుచెయ్యడం. కాని చివరికి ఆమహాశక్తి మనిద్దరినీ బొమ్మల్ని

చేసి ఆడిస్తుంది రాధా. నాకుతెలుసు యిప్పుడు నాకున్నశక్తి. నిన్నుగట్టిగా అడిగానంటే, నువ్వు వుండిపోతావు. ............యెందుకు అంతబాధపడ తావు, రాధా! వొచ్చేలోకంలో యెట్లాగూ కలుసుకుంటాము. అప్పుడు యీగోలలు యేమీ వుండవు. యీ ప్రేమఅంతా, యీయీడ్చే, కాల్చే ప్రేమ అంతా లావణ్యంగా మారుతుంది. యీ "జలసీ" వుండదు; యీ వ్రణం, మనసుపొక్కడం, కరుక్కుమనడం, యేమీ వుండదు" అంది. ఆమె మాట్లాడుతోవుంటే, పూర్వపు నాకిన్నెరకంఠం. వినడం యెంతో బావుంది. కాని భావాలు యెంతమారాయి!

రాత్రి తొమ్మిదిన్నరకి నడకమీద పక్కనవున్న వూరికి బయలు దేరాను. పద్మావతి తనుకూడా కొంతదూరం వొస్తానంది?

"నీసంరక్షకురాలు యేమను కుంటుంది?"

"యేమన్నా అనుకోనీ"

యిద్దరం ఆసన్ననివెన్నెట్లో నడిచాము.

"యిట్లా విడిపోవడం, యీజన్మంలో మనకిశిక్ష. నీకింకా చెప్ప వలసిన సంగతులు యెన్నో వున్నాయే అని విచారమవుతోంది."

యీదినం జ్ఞాపకం వుంచుకుని. తలుచుకొంటూ, అనేక సంవత్స రాలు బతికొలి గావును!"

"నేనూను!"

వెన్నెట్లో, చెట్లకింద, రోడ్డుమీద, ఆమెతో, వొంటరిగా, నామీద ప్రేమతో పక్కన అమెమొహం మెరుస్తోవుంటే, నావంకచూసే ఆమె కళ్ళు తళతళలాడుతో వుంటే! యెప్పుడూ అట్లా నేనడుస్తోవుంటే? చెట్లలో వెన్నెల మచ్చలు, పద్మావతి నడుస్తోవుంటే, కాలుదగ్గిర్నించి వొళ్లంతా తలవరకు పాకుతున్నాయి. అన్నీమరిచి, సంసారాన్ని, ప్రతిష్టని, మరిచి, ఆమెతో అక్కడే యెప్పటికీ, వుండిపోలేదేమా అని ఆశ్చర్యం వేస్తుంది యిప్పుడు. కొంతదూరం నడిచి యిద్దరం, చేతులుకలిపి యెదు రుగా నుంచున్నాము. మారక్తమంతా వొకరినుంచు యింకొకరికి ప్రవహిం చింది. వొదలక అట్లానే నుంచున్నాము చాలాసేపు. యింకేమి చేస్తామో,

యేమవుతామో అనిఅధైర్యముకలిగి, అతిక్రూరంగా చేతులు వొదిలేసి. యెవరి దోవనవాళ్లం మొహంతిప్పాము. వెనక్కి వెనక్కి తిరిగి చూసు కొంటో నడిచాను, మృత్యువుకు పోయేవాడి కాళ్లతోవలె రోడ్డుమీద మసకలో, చిన్నది అయిపోయిందాకా నా పద్మావతిని వెనక్కి తిరిగిచూస్తూనే వున్నాను. కదులుతున్నట్టేలేదు. నాపద్మ, నాప్రాణం, చేతిరుమాల విసి రింది. అక్కడే కూచుని యేడ్చాను. పాపం యెంత కష్టంగా వుందో? నన్ను తలుచుకొంటో వొక్కత్తె, ఆచీకట్లో యేడుస్తో వెడుతోంది. నాకు గుండె ఉన్నదా? మళ్లీ వెనక్కివెళ్లి, ఆమె హృదయాన్ని బాధ పొయ్యే దాకా, అదుముకుందా మనుకున్నాను. కాని తరవాత ...... ఆపాడు తలపునాకాళ్లని కట్టేసింది. సంతిగి, నాపద్మని కనపడకండా చేసుకున్నాను. యింత కఠినాత్ముడు, నీచుడు, లోకంలో లేడనిపించింది. కాని శకుంతల, పిల్లలు . యింక నాకామె లోకంలో కనపడదని నిశ్చయింగా అని పించింది. నాజీవనంమీద సూర్యుడింక వుదయించడు, నాహృదాయాన్ని యింక వెలిగించడు.

. .... ... ..... ..... .. .. ...... .... .. .... .... ...... .... .... ......, ......

---

నేను కాలికట్ చేరిన అయిదురోజులకి తంతివార్త వొచ్చింది.

చెన్నపట్నం వెంటనే రా, చాలా, అపద తటస్తించింది.

పద్మావతి.

వెంటనే బయలు దేరుతున్నాననీ, మునుపున్న హోటల్లోనే వుం టాననీ, పద్మావతికి వుత్తరంరాసి, చెన్నపట్నం వెళ్లాను. వెళ్లిన మర్నా టికి పద్మావతి దగ్గిర్నించి వుత్తరం వొచ్చింది.

“ఆరాత్రి నువ్వు వెన్నెట్లో నన్ను విడిచి వెళ్లిపోయిం తరవాత కదలడానికి కళ్లురాక, నీచేతులు పట్టుకున్నచోటే కూచున్నాను. చాలా యేడ్చాను. నువ్వుమళ్లీ వెనకాలకి వొస్తావేమోననిపించింది. రావాలని యేవేవో ప్రార్ధనలు చేశాను. యెంతో సేపయింది. చంద్రుడు అస్తమిం చాడు, చీకటిపడ్డది. తెల్లవారకట్ట చలి వేస్తే, యింక రావనుకుని, యింటికి

వెళ్లాను. నేనారాత్రల్లా నీతోవున్నానని, న్యాయమూర్తికి. నాతోవున్న ఆమె వుత్తరంరాసిందిట. న్యాయమూర్తి నన్ను వెనక్కిరమ్మని కారణం చెప్ప కండా వుత్తరం రాశాడు. నన్ను వొదిలేస్తాట, కోర్టులో వ్యాజ్యంవేసి నన్ను కటుగుడ్డలతో వెళ్లకొడతాట్ట. నాసంగతి యీమైతేనేంలే? నాకేం? నన్నుంతకన్నా యేంచెయ్యలేక నన్ను కష్టపెట్టి, నాకుబాధకలిగించాలని చూస్తున్నాడు. నేను నువ్వు నిర్దోషివని చెప్పాను. యెట్లనన్నా నిన్ను వొదిలేసి, నన్ను శిక్షించమని అడిగాను. వొప్పుకోలేదు..." నాస్నేహితుడు. ఒకగొప్ప లాయరు, ఆయన్ని సలహా అడిగాను. యీపుకారు అప్పటికే విన్నాడు ఆయన.

మీరిద్దరూ మొదటినుంచీ స్నేహితులు. యెటువంటి స్నేహమో చూపడానికి అతనిదగ్గిర కాయితాలున్నాయి, ఆరాత్రంతా యామైనాతో వోరు రుజువుచెయ్యలేరు. సాక్షులులేరు. ఆరాత్రంతా ఆమె వొక్కర్తా ఆలడివిలోవుండి పోయిందా? మీరు ఆమెని విడిచి వెళ్లారా? యెందుకు వెడతారు? మీరుచేసినపని కథలో చదవడానికి బావుంటుంది, కాని కోర్టులో నెగ్గదు. తెల్లవారి మీరువెళ్లినవూళ్లో మిమ్మన్ని గుర్తుపట్టగలవారెవ్వరూ లేరంటున్నా నమ్మరు. నెగ్గదు. యేమీ ఆశలేదు. అందులో న్యాయమూర్తి అవతల యెవరిచెవులో ఒకమాట వూదినా అయిపోయింది. మిమ్మన్ని శిక్షిస్తారు, కైదు........."

నాలుగురోజులల్లో శకుంతల చెన్నపట్నం వొచ్చింది. చెన్నపట్నంలో వున్న ఆమె బంధువులు వెంటనే యీపుకారు ఆమెకు పంపారు. అంతమాత్రం సహాయం చెయ్యకపోతే బంధువులెందుకు వుండి? ఆమెని చూడ్డానికి నేను వెళ్ళాను.

"యిదేమిటి మీరెక్కడో కాలికట్టులో వున్నారనుకున్నాను"

"శకుంతలా, చాలా యిబ్బందైన సంగతివొకటిజరిగింది."

"సరే, యెదో మళ్లీ పద్మావతి సంగతే!"

మలబారులో మేము కలుసుకున్నాము."

"కలుసుకున్నాం?"

"అవును. నేనువెళ్లిన వూళ్లో ఆమెవుండడం తటస్థించింది."

"ఆరాత్రి అక్కడే పడుకున్నారు. లేదూ?"

"లేదు వెళ్లిపోయినాను."

"అయితే, మాట్లాడారు! ఏం?"

"అవును."

"నాకురాసిన వుత్తరంలో పద్మావతి సంగతి రాయలేదేం? పోనీ! లెండి, మీయిష్టం! నేనెవరిని అడగడానికి యిప్పుడీ యిబ్బంది యేమిటి?

"మేమిద్దరం ఆరాత్రి అక్కడేవున్నామనుకుని న్యాయమూర్తి పద్మావతిని వొదిలేస్తానంటున్నాడు. నామీద..........." శకుంతల మొహం ముడుచుకు పోయింది.

"యీప్రకారం బయిటికి రాకపోతే, పద్మావతిని కలుసుకున్న సంగతి నాకుతెలిసేదేకాదు. లేదూ?"

నేనూరుకున్నాను.

"మళ్లీ ఆమెవుత్తరాలు రాయడం మొదలుపెట్టినప్పుడే అనుకున్నా" యేడవడం మొదలుపెటింది.

"నిజంచెప్పండి. నిజంగాయేచెయ్యలేదుకద! నాభర్తగారు నమ్మకంగా వున్నారా? ముందే యేర్పాటు చేసుకుని కలుసుకోలేదుకద! ఆవూళ్లో? నిజంచెప్పండి."

మళ్లీ అంతా చెప్పాను.

"యెట్లానమ్మను? యిద్దరూ సరిగా ఒకరోజే ఆవూళ్లో యెట్లా కలుసుకుంటారు? మీరు ఆదోవన వెడుతున్నారని అమెకి యెట్లా తెలిసింది? నాగుండెలు మండిపోతున్నాయి. ఆమె యెందుకు వుత్తరం రాయాలి మీకసలు? యెట్లానమ్మడం మీమాట? మీమీద నమ్మకంచెడి, యేచెయ్యను?...................యిప్పుడు మిమ్మన్నెంచేస్తారు? యేమవుతుంది? మన్నెంచేస్తారు? పసిబిడ్డలు వాళ్లగతేమిటి; మిమ్మన్నేమన్నా చేస్తే? యేదోచిన్నప్పుడు అయిపోయిందనుకున్నానుగాని, మళ్ళీ యిట్లా నాకొంప మీదికి వొస్తుందనుకోలేదు. యెంత అవమానం యెంత

ఘోరం? పేపర్లలో పడడం, మీయిద్దరి పేర్లూకలిసి! యింక మన మొహం యెవరు చూస్తారు? ప్రతివాళ్లకీ తెలిసిపోతుంది.

మాఅన్నయ్యా, వొదినావాళ్ల మొహాలు మళ్లీయెట్లాచూడను? యిదివరకే సిగ్గుగావుండేది......లోకంలో యెన్నో యిట్లాంటివి జరుగుతున్నాయి. అన్నీకోర్ట్లకెక్కుతున్నాయా. నాదురదృష్టం కాకపోతే? ఆవుత్తరంరాసింది, దానిమూలాన యిదంతా.......''

"వుత్తరం రాయక పోతే మాత్రం మేం కలుసు కోడం తప్పేదా?"

''మనఅమ్మాయికి సంబంధం యెట్లా కుదురుతుంది యిట్లాంటిది కోర్టుకెక్కిం తరవాత?

''మరి యిప్పుడు చేసేదేముంది? యిట్లా గోలపెట్టి యేంప్రయోజనం?''

''అవును చేసేదేముంది? అంతాచెయ్యడమే? చేశారుగా దాని వొంటి మదం వల్ల. మేమంతా................''

''చాలు, వూరుకో. ఆమెనేమీ అనకు. ఆమెసంగతి నీకేం తెలుసు?''

''అసలు వూరుకున్నవారికి మీకెందుకు వుత్తరాలురాయాలీ?''

..................................మర్నాడు నేను హోటల్లో గదిలో కూచుని లెఖలు చూసుకుంటూవుండగా, పద్మావతి వచ్చింది. తలుపు, లోపల గడియవేసి, నాదగ్గిరికివొచ్చి కుర్చీలో కూచుంది. మొహం చిక్కినట్టుగా అలిసినట్టువుంది. నిద్రలేనట్లూ యేడ్చినట్లూ వున్నాయి ఆదయగల కళ్లు.

'' పద్మా? యిక్కడికి యెందుకువొచ్చావు?''

పొరిలివొచ్చే వుద్రేకాన్ని ఆపుకోడానికి లాగు, కష్టపడ్డది. కళ్లమీద చెయ్యేసుకుంది. యేడుస్తుందేమో అనుకున్నాను.

"యెందుకు వొచ్చానంటే ...........................వొచ్చానంటే...........
..................నిన్ను వొక్కసారి చూద్దామని..................రాధా, నిన్ను నా రాధని, నిన్నొక్కసారి చూద్దామని................''

దగ్గిరికి వెళ్లి కూర్చున్నాను.

యిట్లారావడం మంచిపనా? అలసిపోయినట్లున్నావమ్మా!'' నేను కనపడక, నాకోసం వెతికినట్లు చెయ్యిజాచింది. కావిలించుకుని ఆమె తలని నాబుజంమీదికి తీసుకున్నాను. నాకంఠంచుట్టూ చెయ్యేసి, యేడ్చింది.

''నాకు తెలుసు............... నీదగ్గిరికి వొస్తే ........ ''

''రాధా, కొంచెం చల్లని నీళ్ళున్నాయా? మొహం, కళ్ళూ, కడుక్కుంటాను. యెందుకు యేడ్చాను, నీకు సంతోషమొచ్చే సంగతి చెప్పడానికి వొచ్చి?...........''

మంచినీళ్ళిచ్చాను.

''యీకోర్టులో వ్యవహారం యెట్లనన్నా మాన్పించెయ్యకపోతే యెట్లా? అంతా ఆలోచించి సద్దేశాను: యింకేమీ యిబ్బంది లేకండా?

''యేమిటి! అసలు వ్యాజ్యం యేమీ లేకండానా?''

''అవును.''

'యేమిటి?''

''న్యాయమూర్తి నిన్నేమీ చెయ్యడు.''

''యెట్లా?''

''యెట్లాగో ఔఅట్లా. సమాధానంచేశాను......................... నీతో మాట్లాడుతో, నీదగ్గిరిగా యిట్లా కూచోడం యెంత బావుంది, రాధా!

యెంతబావుంది!?

లేచి నుంచుంది,

''నువ్వట్లా కూచో. నేను సరిగ్గానే వున్నానులే యిప్పుడు. నేనిక్కడ కూచుని మాట్లాడతాను..............యెంతబాధ పడ్డాను యిన్నాళ్లు! అబ్బా!''

నావొంకచూసి చిన్నగా నవ్వింది.

యిద్దరం బాధపడ్డాముకదూ? యేంలోకమిది? మననిద్దర్నీ నలగకొట్టేశింది. యింతకీయేంచేశామని! కాని యెన్నిదెబ్బలుతిన్నా మనకి

ఒకర్ని చూడగానే యింకోరికి యీపిచ్చిసంతోషం. ప్రేమించుకున్నాము అది మనం చేసిన మహా ద్రోహం..................ఆకొండలూ, నీళ్ళూ, వెన్నెలా, జ్ఞాపకమున్నాయా, రాధా? ఆపడవకి చిల్లీ! వెన్నెట్లో నువ్వు నీళ్ళతోడి పొయ్యడం! ఆఖరికి విడిపోవడం, నన్నొక్కదాన్నీ వొదిలి చిన్న చిన్న వాడవై వెన్నెట్లో నువ్వు వెళ్ళిపోవడం, ఒకవేళ మళ్ళీ వొస్తావేమోనని నేను అక్కడే కూచోడం, దుర్భరమైన నా నిరాశా; చీకటీ తరువాత మళ్ళీ యీగోలా, లాయర్లూ, బెదిరింపులూ తిట్లూ... యెంతభయం వేస్తోంది, తలుచుకుంటే! ఆ ఆనందకరమైన కొండలు భయింకరమైన యీ చోటికి యెంతదూరం! అది యింకోలోకం గావును! ఆస్వర్గం అనుభవించి, మళ్ళీ అసహ్యాకరమైన యీ గోలల్లో.........

"యిదంతా తప్పిస్తానన్నావుగా!"

"అవునవును. కాని నిన్ను ముందు ఒక్కసారి చూడాలనిపించింది ......... యేదీ, ఆమోహం, యిట్లా యియ్యి ........ నీదగ్గిరికి వొస్తే నాకు వొంటరిగా వున్నట్లే వుండదు, తక్కినవాళ్ళతోమల్లే! యెంతశాంతి యింకేమీ అఖర్లేనట్టుంది. నిన్ను చూస్తోవుంటే చాలు."

నన్ను తాగేస్తున్నట్టు నావంక చూసింది కొంచెంసేవు.

"యిదంతా కోర్టులో కెక్కితే యేమవుతుందో ఆలోచించావా?"

"నేను వూరుకుంటానా? శాయశక్తులా కోర్టులో పోట్లాడనూ? నాకూ గొప్పలాయరు స్నేహితులున్నారు. కాని చూస్తాను."

"లాభంలేదు; రాధా;"

"యేమో! కాని..................."

"యేమీ లాభంలేదు. వోడిపోతావు..........................అప్పుడేం చేస్తావు?

"ఆసంగతి యిప్పుడెందుకు"

"యేమీముందు ఆలోచించవు. పాపం యెట్లా బతుకుతావో యీలోకంలో! యెప్పుడో వొకప్పుడు యిట్లా కలుసుకోడానికన్నా వీలు లేకండా నేను వెళ్ళిపోతే, నీవిషయమై జాగ్రత్త యెవరుతీసుకుంటారు? యేమవుతావు, రాధా! నువ్వు?.................. యెందుకంటె............ నేను యిక్కణ్ణించి ...........వెళ్లిపోతున్నాను. ఒకచోటికి............నిన్ను చూస్తే, అప్పు

డప్పుడు నీతల్లినైతే యెట్లావుండేదో, అట్లా అనిపిస్తుంది. అందులో యిప్పుడు మరీ అట్లావుంది."

కొంచెంసేపు నాకేసి నిదానంగా చూస్తోకూమంది. నాకంఠంలో కన్నీళ్లనిండాయి. మాటరాలేదు.

నాసంగతి ఆలోచించావా? కోర్టులో వాళ్లు నన్ను వేశే ప్రశ్నలు, వాళ్లబయిట పెట్టే నీపుత్తరాలు అన్నీవున్నవీ, లేనివి, పత్రికల్లోపడడం, నన్నందరూ వొదిలెయ్యడం, తెలిసినవాళ్లందరూ మొహాలుతిప్పడం, వుండడానికి యిల్లులేక, మాట్లాడడానికి మనిషి లేక ..........................

"పద్మా! నేను బతికివుండగానా?"

నువ్వేంచేస్తావు? నీకు శకుంతలవుండాలా? నాసంగలేమి ఆలోచించ లేవు. యెదీ, నీమొహంచూడనీ; నిజంచెప్పు నాకుసహాయంచెయ్యగలవూ? చెప్పు."

"వుత్తరంమీకెందుకు రాయాలి అసలు అది?'' అని నన్ను జాడించే శకుంతలనీ, అమె వెనుక నుంచున్న యిద్దరు పిల్లన్నీ, జ్ఞాపకం తెచ్చు కున్నాను. కాని పైకిమాత్రం,

"యెట్లాగో వొకలాగు...." అన్నాను.

"నామూలంగా, నీడబ్బూ, ఆస్తి, నీపిల్లలకు రావలసిన ఆస్థిఅంతా కోర్టుకి కర్చు పెట్టిస్తారు. నువ్వు కష్టపడి సంపాయించుకున్న పేరు మళ్ళీ చెడకొడతారు. నీపత్రిక, నీపేరు, నీపిల్లలు——పాపం ఆఖరికనిన్నూ వద లరు."

యివన్నీ చెప్పి భయపెట్టి, నన్నెందుకు యిట్లాభాధపెడతావు యివన్నీ కదిలించి నామనసులో నాఅంతట నేనుతలుచుకుని ప్రతిరాత్రీ పడుతున్నభాధ చాలదూ? అష్టదరిద్రం అవుమానం అందరి నమ్మకం చెడడం నాపని పాడవడం. నాపిల్లలు పెద్దవాళ్లై నేనెటువంటి వాణ్ణో విని, నాపేరు అసహ్యించుకోడం, నామూలాన వాళ్ళకి ఆ జన్మాంతమూ, అవుమానం, యేమెరగని, వాళ్లకి! ......... నువ్వో, నీసంగతేమిటి? నీపట్టు దల, నీధైర్యం, అన్నీపోయి, వొంటరిదానివై, దిగులుపడి నీపిల్లల్ని వొదలి వాళ్లగతి! తల్లిలేక, అతండ్రితో............ తల్లి యిట్లాంటిదనివిని,

నీపేరుచెపితే నీపిల్లలే వుమ్మివేసి ...చాలు చాలు, యిదిమననితరిమి· పట్టుకుని, యేడిపించి, వదలక మనజీవనమంతా; మనతరవాత మనపిల్లల్ని పట్టి..... అయ్యోపాపం. నాపద్మా నువ్వు నీపిల్లల్నియెట్లా వొదిలి పోతావు? వాళ్ళకి నీ సంగతి యేమని నేప్పుతారు?........ నీసొంతపిల్లలు, కడుపున బుట్టిన పిల్లల్ని ................''

మొహం చేతుల్లో మూసుకున్నాను, చెప్పలేని భావతో. పద్మావతి మొహం తెల్లగా అయింది, పెదిమలు బిగించింది. నామీద యెంతో దయకనపడ్డది· ఆమె నిర్మల నేత్రాల్లో! మెల్లిగా మాట్లాడింది, హృదయం లోంచి'' వొద్దు నాకోసం నువ్వుశకుంతలని యేడిపించవద్దు, బీదతనంలో వెలిలో నయినాసరే. ఒళ్ళి కలుసుకుంటే వొకళ్లని వొకళ్లం వదలలేము· ప్రేమబలం తెలుస్తోంది· శకుంతల బాధపడుతుంది. నిన్నుబాధపెడుతుంది· మధ్యనువ్వు నలుగుతావు. యివన్నీ ఆలోచించాను. అందుకనే యీగోలలన్నీ యేమీరాకండ. కోర్టువ్యవహారమే లేకండా చేస్తున్నాను· యీసంగతి నీతోచెప్పి నీకా విచారం పోగొట్టాలనే వొచ్చాను· అవును, నేను మాత్రం కొంచెం కష్టపడాలి, అందుకోసం· కష్టంకాదనుకో...........ఒక మోస్తరగా....కాని వీలవుతుంది. సందేహం లేదు· నేనుభరించ లేనిదనుకోకు.........ఫరవాలేదు........''

కిందిపెదిమ కొరుక్కొని వూరికే నావొంకచూస్తో కూచుంది, ఆలోచిస్తో.

''పద్మా, యెప్పుడో చిన్నప్పుడు నేనడిగినప్పుడే నాదగ్గిరికి వొచ్చేసివుంటే!''

నామాట విన్నట్టే లేదు· యెక్కడో ఆలోచిస్తుంది. మళ్లీ అంది ........

నీపిల్లలమీద నీకు యెంతో ప్రేమ అనుకుంటా· నీపిల్లలు వాళ్ళు· అందరికంటె ముఖ్యంవాళ్లు· వాళ్ళు నీవాళ్ళు, నువ్వు నీస్వంతం .... ....

"యేమిటివి? యెందుకు నన్నిట్లా యేడిపిస్తున్నావు? వాళ్ళమీదా వుంది ప్రేమ, అంతకంటె యెంతో యెక్కువగా, నీమీదా వుంది·''

''లేదు, లేదు, వాళ్లమీద వున్నట్టు వుండదు· యిదివేరు·''

"అబద్ధం, నువ్వేనా........"

పద్మావతి మొహం యెదో గంభీరంగా కనపడ్డది. నేనెప్పుడూ అట్లా చూడలేదు ఆమొహాన్ని!

"లేదులే యెదో నీమనసులో ప్రేమ అంతే నామీద. కాని నీఆత్మలో..................పోసీలే..........నాకుతెలుసు, రాధా. ....చూడుమరి యెట్లా యేడుస్తున్నావో, నీకళ్లవెంబడి కారేది నెత్తురు' కన్నీరుకాదు,.... ..................పరవాలేదులే. నిజమే చెపుతున్నా. నీకుతెలీలేదు. నీహృదయంతో అంతయెక్కువగా ప్రేమించేది వాళ్లనీ. నాకాసంగతి తెలిస్తే మాత్రమేం? నీకు నామీద ప్రేమ లేదనుకుంటానా? వాళ్లమీద యెక్కువ ప్రేమ అనినాకు యీర్ష్యా? ......... నాబతుకంతా పాడుచేసుకున్నాను. యిప్పుడు తెలుస్తొంది, ఆఖరికి యేంచెయ్యటానికి వీలులేనప్పుడు, అంతా మించిపోయినప్పుడు. మనసొంతంవి; మనవిఅనుకున్న వే, నిజంగామనం యెక్కువగా ప్రేమించేది, మనప్రాణాన్నిచ్చి కొనుక్కుంటామే, వాటిని మాత్రమే!......................నేనెంత కఠినురాల్ని అయినా, నేనెంత నాసౌఖ్యమే చూసుకున్నా 'రాధా' నాచిన్న రాధా, మొదటినుంచీ, నిన్ను నిష్కపటంగా, నాఆత్మ అంతటితోనూ ప్రేమించాను మొదటినించి, చిన్నప్పుడు మనం ఆడుకున్నప్పటినించి, యెప్పుడూ, యెప్పుడూ! కాని నేనుమాత్రం నీదాన్ని కాదలుచుకోలేదు, నాదాన్నే అయి వుందామనుకున్నా. నీదాన్నే అయితే యిద్దరి ఆనందం ప్రేమ పోతాయి అనుకున్నాను....యిప్పుడు విచారించి లాభమేముంది?....యిద్దమిటి యిట్లా మాట్లాడుతున్నాను....కాని చూడు. యిప్పుడు రాజీచేసుకోవాచ్చు. ఫరవాలేదు. నాకు చాతనవును. నిన్నూ నీపిల్లల్నీ కాపాడుతాను. యేం భయంలేదు"

"యెట్లా"

"యెట్లానయితేనేం, పోనిద్దూ. యిప్పుడు అడక్క యెట్లానో తెలుస్తుంది, రాలోనే. కాని యింక నీకు వుత్తరాలు రాయడానికి వీల్లేదు. యెప్పుడూ. యెన్నటికీ, ఒక్కసారి కూడా, అందుకునే నిన్ను చూడాలని వాచ్చాను. నీదగ్గిర్నించి శలవుతీసుక పోదామని, నాజీవనంలో

చేతులారా, పోగొట్టుకున్న ప్రేమనంతా చూసిపోదామని. . . .''

పెదిమలు కొరుక్కుని నాకళ్లల్లోకి చూస్తోంది. నన్నంతా వొక్కసారి చూడాలనేట్టు చూసింది. ఆమె ముద్దుచెంపల మీద నించి కిందికి జారుతోంది, కన్నీరు.

''వెళ్లిపోవడ మేమిటి? యెక్కడికి?''

''యిప్పుడు అడక్కు, న్యాయమూర్తితో రాజీపడాలంటే, కొన్ని షరతులకి వొప్పుకోవాలి. అవేమీ అసహ్యమైనవికావు. నాకోసం విచార పడకు. నేను నిన్నెన్నటికీ యింక కలుసుకోనని అతనికి నమ్మకం పుట్టించాలి. అప్పుడు నిన్ను వొదులుతాడు. అందుకని 'రాఘా' యీజీవితంలో నువ్వూ నేనూ వొక్కసారి కూడా మాట్లాడుకోము. . . . .''

''పద్మా, యేమిటిది? అతనేం కావాలంటున్నాడు.''

''అడుగకు. అట్టేవ్యవధిలేదు. నేను అక్కడికి వెళ్లిపోవాలి. ప్రయాణమై, నిన్నొక్కసారి, ఆఖరుసారి, చూసిపోదామని వొచ్చాను. యిదే ఆఖరుసారి కలుసుకోడం, మాట్లాడుకోడం. రాఘా, చెప్పు ముందేం చెయ్యబోతున్నావు? అంతాచెప్పు. ముందే అర్థంకావాలి, నువ్వేం చేస్తుంటావో. . . . .నేను న్యాయమూర్తికి వాగ్దానం చెయ్యాలి; అతి భయంకరమైన వాగ్దానం, నిన్ను వొదిలేస్తానని. నీసంగతి ఆలోచించనన్నా, ఆలోచించనని, పత్రికల్లోనన్నా నీసంగతి చదవనని. యింకజాప్యము చెయ్యడానికి వీలులేదు. కనుకనే ఆఖరుసారి నామనసంతా నీతో, నాకళ్ళని నీరూపంతో, నింపేసుకుంటున్నా. యెన్నో యేళ్లదాకా సరిపోవాలి, యిప్పుడు నిన్ను చూడడం.''

''యెక్కడికన్నా వొంటరిగా వెళ్లిపోవాలా?''

''అవును. యెక్కడికి వెళుతున్నానో, నీతోచెప్పకూడదు. చెపితే నువ్వు వొప్పుకోవు. న్యాయమూర్తి ఘూరుకోడు అప్పుడు. . . .యెన్నో యేళ్ళు నీకోసం యెదురుచూస్తు వుంటా.''

''యెక్కడ వుంటావు?''

''యెక్కడో వొంటరిచోట, చాలా అందమైనచోట, కాని నువ్వు వుండవు. అంతే. యింక అడక్కు.''

కొంచెంసేపు కూచుని. లేచింది.

"రాధా, శలవు. వెళ్లాలి, నన్ను జ్ఞాపకముంచుకో. పోనీ, నిన్ను చూశాను చాలు. నీపద్మ. . . .యెప్పుడూ నిన్ను. . .ప్రేమిస్తా. . . ." మాటలు తడపడ్డాయి. కళ్లుమూసింది తూలింది. చేతులతో వెతికింది.

"రాధా, రాధా, యెక్కడ?"

కావిలించుకొని పట్టుకున్నాను. బల్లమీద కూచున్నాము. నన్ను గట్టిగా కావలించుకుంది. మెల్లిగా చేతులు వొదులైనాయి. కష్టపడి కళ్ళు విప్పింది.

ఆఖరుసారి చూడనీ, యేదీ. . .మొహం. . .నీకోసం. . .కోప్పడకేం. మరిచిపోకు. . .మళ్ళీ కలుసుకుంటాం. . .నిజం రాధా. . . . . యాడవకు. . . .క్షమించు....రా....ధా....నా....చి న్ని చి....న్ని....పి చ్చి....రా....ధా!"

అంతే. అట్లాయెంతసేపు వున్నానో, నామనసు ఆగింది. కాల మాగి పోయింది. పద్మావతి చేతులు నామీదే వున్నాయి, ఆమెతల నాబుజంమీద వేలాడుతోంది, ఆమెత్తని జుట్టు నామొహంమీద పడివుంది. తలుపు విరిగేట్టు తటాలున తన్ని, న్యాయమూర్తి, యింకెవరో యిద్దరు మనుష్యులూ వొచ్చారు.

"కింద ఆమె మోటారుంది. యిక్కడే వుంటుంది." అంటున్నాడు న్యాయమూర్తి.

"యిదిగో.........లే,.........రా"

పద్మావతిని భద్రంగా పడుకోపెట్టి లేచాను.

"అదుగో, తీసుకు వెళ్ళండి." న్యాయమూర్తి మొహం తెల్లపడ్డది. పద్మావతీని చూస్తూనుంచున్నాడు. అంత విరోధంలోనూ, అతన్ని చూస్తే, నాకు జాలి వేసింది. నావొంక తిరిగాడు. కళ్ళలో నీళ్ళున్నాయి,

"మనిద్దరం...................కలిసి చంపాము.....యిద్దరం.................. ముక్కలకింద చీల్చుకున్నాము." అన్నాడు. పోయినసారి నేనూ పద్మావతీ కలుసుకున్నప్పుడు, ఆరాత్రి ఒకచోట వుండలేదన్నాను.

"యిప్పుడెందుకు? యింకెందుకు? యేమయితేనేం? యింకేమయితేనేం" అన్నాడు, చాల విచారంతో. పాపం!

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B108 |
| పుస్తకం పేరు | దైవమిచ్చిన భార్య |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 115 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 41 - 42 |
| తయారు చేసినది | APSar |
| పేజీలు విడదీసినది | APSar |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |